# అహంకార శతకం

గురుసహస్రావధాని

డా॥ కడిమిళ్ళ వరప్రసాద్

# అహంకార శతకము

గురు సహస్రావధాని

డా॥ కడిమిళ్ళ వరప్రసాద్

# అహంకార శతకము

రచన

గురుసహస్రావధాని
డా॥ కడిమిళ్ళ వరప్రసాద్

ప్రచురణ కాలము..2010

ప్రతులు :1000

వెల.. 30/- రూ.లు

ప్రతులకు
కడిమిళ్ళ రమేష్
3.6.50, యళ్ళమిల్లివారి వీధి
నరసాపురం - 534275, ప. గో. జిల్లా
సెల్ : 9247879606

కవర్ డిజైన్ మఱియు ముద్రణ
**క్రియేటివ్ మల్టీకలర్ ఆఫ్‌సెట్**
స్టేట్ బ్యాంక్ ఎదురుగా, స్టీమర్ రోడ్
నరసాపురం-534275, ప.గో.జిల్లా
సెల్. 9866115113

# కృతం జానామి

కోరి కృతినందుకొన్న కవి, నాట్యవిద్యావిశారదులు
శ్రీ దండిభట్ల వైకుంఠ నారాయణమూర్తి

ఈ శతకాన్ని గూర్చి ముచ్చటించి, వారి మనస్సును ఆవిష్కరించిన
పౌరాణిక సార్వభౌములు శ్రీ జటావల్లభుల జగన్నాథం

కవితా నటనా దర్శకత్వాది బహుముఖ ప్రజ్ఞావంతులు
శ్రీ గొల్లపూడి మారుతీరావు

పద్యమైనా పాటైనా అసలు సిసలు కవి
శ్రీ జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు

వ్యుత్పన్న శతావధాని, నా సహాధ్యాయి, మంచి మిత్రుడు
డా॥ అబ్బిరెడ్డి పేరయ్యనాయుడు

ఈ అహంకారానికి ముచ్చటైన రూపాన్నిచ్చి నా చేతిలో పెట్టిన
క్రియేటివ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్

ఇంకా ఎందరో హితులు, సన్నిహితులు, ఆత్మహితులు ముఖ్యంగా
నిరహంకారగుణ భూషణులు అందరికీ సర్వదా సర్వథా కృతజ్ఞుడను.

కడిమిళ్ళ వరప్రసాద్

# ఒకమాట చెప్పనా!

నా గురువులు చాలా గొప్పవారు. అందుకే నేను కవిని అవధానిని అయ్యాను.

నా శిష్యులు చాలా చాలా గొప్పవారు. అందుకే వారు కవులు, కవయిత్రులు, అవధానులు అయ్యారు. నా అదృష్టం ఇంకా గొప్పది అందుకే నా ఇద్దరు కుమారులూ కూడ కవులయ్యారు.

ఏమో ఎవరికి తెలుసు?

ఈ కారణాలవల్ల ఇదుగో నేనున్నానంటూ ఏనాడైనా నాలో అహంకారం ప్రవేశిస్తుందేమోనన్న భయం. ఏం చెపుతాం ఇప్పటికే నాలో దూరిపోయి దాక్కుందేమో. వచ్చిన చిక్కేమిటంటే ఎవరి అహంకారం వారికి కనబడదుకదా ఇతరులకు తప్ప. అందుకే ఎందుకేనా మంచిదని దానిని మర్యాదగా తరిమికొట్టాలనుకొన్నాను.

ఉత్తిష్ఠంతు భూత పిశాచాః, ఏతే భూమిభారకాః, ఏతేషామవిరోధేన అన్న సాంప్రదాయిక ఆర్యోక్తిని పాటించి, ఆ అహంకార భూతాన్ని శత పద్యసుమాలతో అర్చించి మరీ పంపాలనుకొన్నాను.

నా జోలికే కాదు ప్రపంచంలో ఏ మానవుని జోలికీ పోవద్దని బ్రతిమిలాడుకొన్నాను. ఇది ఒక్కటి ఉంటే ఎన్ని ఉన్నా ఏమీ లేనట్లే. ఇదిగనుక లేకపోతే ఏమీ లేకపోయినా అన్నీ ఉన్నట్లే. అందుకే సంకల్పించాను. మూడురోజులలో పూర్తిచేసాను. మీ చేతులలో పెట్టాను. నిరహంకార గుణభూషణులారా! అవలోకించండి, అహంకార విశ్వరూపాన్ని గమనించండి. దానిని మీ దరిదాపులకుకూడా రానివ్వకండి. ఇప్పటికే వచ్చి మీలో తిష్ఠవేస్తే వెంటనే తరిమికొట్టండి.ఈ శతకం నచ్చితే ఆనందించండి. నచ్చకపోయినా ఆశీర్వదించండి.

ఎల్లప్పుడూ మీ విధేయుడనే

కడిమిళ్ల వరప్రసాద్

# అహంకారానికి ఇన్ని పార్శ్వాలున్నాయా !

## గొల్లపూడి మారుతీరావు

**కవి, రచయిత, చలనచిత్ర నటులు**

వరప్రసాద్ గారు వెయ్యి పద్యాలు ఆశువుగా చెప్పగల దిట్ట. ఎందుకో ఆయనకి అహంకారం మీద చిన్నచూపు పడింది. తిట్టిన తిట్టు తిట్టకుండా నూరు తిట్లు తిట్టారు. అయితే ఒకే ఒక పద్యంలో అహంకారం గొప్పతనాన్ని చెప్పారు. పోనీ, ఆ తిట్లన్నీ లలితంగా ఉత్పల చంపకాలలో సంధించలేదు. రెండు పెద్ద జంతువుల్ని వెంట దెచ్చుకున్నారు. మత్తేభం, శార్దూలం. అయితే కేవలం క్రూరత్వానికి తావు లేకుండా గంభీరంగా, గడుసుగా, హుందాగా వాటిని చెయ్యి పుచ్చుకు నడిపించారు.

మత్తేభం అరణ్యాన్ని బెంబేలెత్తించగల శాకాహారి. కాని వరప్రసాద్ గారి మత్తేభం

రసనాగ్రమ్మొక శ్వేతపద్మ నిభమై, బ్రహ్మాణికిన్ బీఠమై
రసవద్వాక్య లతాంతమాలికల నర్చల్ సేయు సాహిత్య లా
లసులే మంచి-చెడుల్ స్మరింపకయ వైరస్యములు.... ( ప.27)

అంటూ ఠీవిగా నడిచింది. నాకెప్పుడూ అడవిలో పులి అందంగా కన్పిస్తుంది. దాని క్రూరత్వంకంటే సృష్టిలో దాని సౌందర్యం నన్ను నిలిపి పలకరిస్తుంది. కవిగారి శార్దూలం కేవలం కాగితపుపులి కాదు.

ప్రజ్ఞావైభవమెంత యుండినను నీ ప్రాగల్భ్య సంపత్తిచే
నజ్ఞానార్ణవమందు మున్గెదరు నీకాహారమైపోవు ద
ద్విజ్ఞానమ్ము సమస్తమున్... ( ప. 57 )

అంటూ శార్దూలాన్ని నల్లేరుమీద బండిలా నడిపించారు అవధానిగారు. ఆయన విద్యకి ఎంత వెన్న కలిసిందో!

నిజానికి అహంకారానికి చాలా అపకీర్తి వచ్చింది కాని, దానికి చిన్న సుగుణం కూడా ఉంది. వ్యక్తి తన సామర్థ్యాన్ని మనస్సులో భావిస్తే అది ఆత్మవిశ్వాసం. బయటపడి చెప్తే అది అహంకారం.

అయితే చెప్పి చెల్లుబడి చేసుకున్న మహానుభావులున్నారు

అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదాభోగ మస్మాదృశుం
డలఘు స్వాదు రసావతార ధిషణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యుడయినాడన్నట్టిది...

అని విశ్వనాథ రొమ్ము విరుచుకున్నా, గిలిగింతలు పెట్టినట్లు సాహితీ లోకమంతా ఆనందించి, సమర్థించింది. అంతటి అందమయిన మేథా సంపన్నమయిన అహంకారం ఎవరికి సాధ్యం? ఓ దోహల బ్రాహ్మీమయమూర్తికి తప్ప.
వాణి నారాణి అన్నాడు మరో మహాకవి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు.

ఈ శతాబ్దాన్ని నేను నడుపుతున్నాను అన్నాడు శ్రీశ్రీ. సాహితీ ప్రపంచం అంగీకరించి, ఆయనవెనుక నడిచింది.

అహంకారాన్ని అందమయిన చరిత్రలు చేసిన సందర్భాలివి, మహాకవులు వీరు.

మొదటి ప్రపంచ యుద్ధంలో దేశాలను జయించి, జైత్రయాత్ర చేసివచ్చిన నెపోలియన్ తల్లి మరణశయ్య దగ్గర నిలబడి ఉన్నాడు. అమ్మా! నువ్వు బ్రతకాలి, నువ్వు వెళ్ళిపోతే నన్ను నాపేరు పెట్టి పిలిచే ఒకే వ్యక్తిని నేను నష్టపోతాను అని, లోకం ఆయనని నియంతగా గౌరవించే స్థితిలో ఉందని చెప్పుకున్నాడు. అతని అహంకారానికి ఆవలి ఎల్ల అతని తల్లి. ఆమెను మిగుల్చుకోవాలని అతని తాపత్రయం.

నా ఉద్దేశ్యం- వ్రాసే దశలో రచయిత మనస్సులో అహంకారం ఉండాలి. పాఠకుడికి అందించే దశలో వినయం ఉండాలి. సాహిత్యంలో తన

స్థానాన్ని వెదుక్కునే దశలో ఆత్మన్యూనతా ఉండాలి. ఎందుకంటే గొప్పతనాన్ని ఎదుటి వ్యక్తి గుర్తించాలి. ఔన్నత్యాన్ని కాలం, చరిత్రా యివ్వాలి. వరప్రసాద్‌గారూ దీనిని అంగీకరిస్తారనుకుంటాను. అవధాని మనస్సులో తనదైన ప్రపంచంమీద ప్రభుత్వం లేకపోతే మెదడు ఆలోచనను పంచదు. నాలుక మాటని విప్పదు.

ఆశువుగా, అలవోకగా ఆలోచనని అందమయిన పద్యంగా మలచడాన్ని ఊపిరి చేసుకున్న అవధానిగారిలో ధార, చక్కని కవితా ప్రౌఢిమ, నుడికారపు సొబగులు సమృద్ధిగా ఉన్నాయని చెప్పడం మామిడిపండు తియ్యగా ఉంటుందని చెప్పడం.

ఈ వంద రసగుళికలలో రెండుసార్లు చదివించిన పద్యాలు ఏరాలని మూడు నాలుగుసార్లు చదివి ప్రయత్నించాను కాని, వస్త్ర తాళితం పట్టి, రెండింటిని కొసరాను.

ప్రాలేయాచలమగ్ని గోళమగు, స్వర్గంగాంబువుల్ చేదగున్
బూలే రాలగు, త్రాడు పామగు, సభాపూజ్యుండు నింద్యుండగున్
శ్రీలుం బొంగినచోటు వేదికయగున్ జ్యేష్ఠామహాదేవికిన్
లీలల్ నీవిటులుండు నిక్కముగదే! రేరే! యహంకారమా!! (ప.85)

పదివేలేండ్లు తపమ్ము చేసియు మహైశ్వర్యమ్ము సాధించియున్
పదిశీర్షమ్ములు కల్గియున్ సుఖముగా వర్ధిల్లెనే భూమిపై
బదికాలమ్ములు నిల్చెనే యతడు నీ పాదంబులన్ బట్టుటన్
గద! సర్వమ్ము నశించి, మట్టిగఅచెన్ గాదా! యహంకారమా!! (ప. 89 )

అహంకారాన్ని ఆమడదూరంలో ఉంచగల సౌజన్యం, విచక్షణ గలవారుకనుకే వరప్రసాద్‌గారి కవితా కన్యక రీవిని సంతరించుకుని, కీర్తిని సంపాదించుకుంది. ఈశతకం చదువుతున్నప్పుడుకాని అహంకారానికి ఇన్ని పార్శ్వాలున్నాయని మనకి తెలీదు. రకరకాల రోగాలకు తగిన చికిత్సను వెదికే

గ్రంథంలాగ ఇది అహంకారం జబ్బుతో బాధపడుతున్నవారికి user guide. అయితే ఆ రోగులకు తాము అనుభవించేది రోగమని తెలీదు గనుక, తెలిసినా ఒప్పుకోరు కనుక రోగం ఉన్నా లేకపోయినా అందరూ వేసుకోవలసిన vaccine ఈ అహంకారం శతకం.

పదిమందిని ఏడిపించి, పీడించి, అణగద్రొక్కే శక్తికి పదిసార్లు చదువుకోగలిగే స్థాయిని కల్పించారు వరప్రసాద్‌గారు. ఒక్క కళకే ఈ ప్రత్యేకత ఉంది.

కవిత లోపాన్నికూడ అలంకరించి, భూతద్దంలో అక్కరలేదనిపించేంత పెద్దది చేసి, చూపిస్తుంది. ఈ తూకాన్ని నూరుసార్లు ప్రయత్నించి నూరుసార్లూ సఫలీకృతులయ్యారు వరప్రసాద్ గారు. అహంకారపు వికారాన్ని, ఆకారాన్ని యింతగా కాంతా సమ్మితం చేయడం చాల శ్రేష్ఠమయిన పని. చక్కగా సాధించి, సాహిత్యానికి ఓ శతకాన్ని, రోగికి పథ్యాన్ని ప్రసాదించారు. వారికి నా అభినందనలు

**గొల్లపూడి మారుతీరావు**
చెన్నై
18-12-2009

# మమకారం

## జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు

**కవి, సినీ దర్శకులు**

ఈ అహంకార శతకం ఒక అద్దం. ఇది ఇహార్థం, పరార్థం, మహార్థం. ప్రతిపదార్థం, సఖార్థం, సుఖార్థం. నిజంగా యథార్థం. క్రమంగా సుధార్థం.

అందరూ ఇది చదవాలి. ముఖ్యంగా కవులూ, పండితులూ, కళాకారులు. ఎవరి అహంకారం వారికి తెలియదు. ఎదుటివారికి తెలుస్తుంది. కానీ అంతర్ముఖుడైన తత్త్వఖనికి దీని లక్షణం తెలుస్తుంది. అలా అంతర్ముఖుడైన గురుసహస్రావధాని డా!! కడిమిళ్ళ వరప్రసాద్ గారికి ఈ అహంకార లక్షణం సుస్పష్టంగా దర్శనమిచ్చింది. ఎవరో ఆత్మీయులు అహంకారంతో ప్రవర్తించడంవల్ల కూడా ఈయనకు ఎంతో బాధ కలిగి ఈ అహంకార స్వరూప స్వభావాలను గురించి బాగా చింతన చేసి, లోకానికి అవసరమయ్యే విధంగా ఈ అహంకార శతకం వ్రాసారని నా అహంకారానికి అనిపిస్తోంది.

ఎన్నో యేండ్లు పరిశ్రమించినను గానీ రాని సత్కీర్తి య
న్నన్నా! యొక్క ముహూర్తమందు మటుమాయంబౌను నీ స్పర్శచే
నిన్నున్ ముట్టిన పైడి మట్టియగు బైనిన్ మానసోల్లాసమున్
ఛిన్నంబై చెడిపోవు నీవలననే ఛీఛీ! యహంకారమా!! ప.13

ఆమూలాగ్రముగా ద్రయీపఠనమో, యాపైని షట్ఛాస్త్ర వి
ద్యామంజూషను నెత్తికెత్తుకొనుటో, యారూఢిగా సాహితీ
స్వామిత్వమ్ము గడించుటో సులభమై వర్తిల్లునేగాని, శి
ష్టామోదమ్ముగ నిన్ను గెంటుట యసాధ్యమ్మే యహంకారమా!! ప. 29

జననంబాదిగ జెడ్డవారసలు విశ్వంబందునన్ లేరు, పా
వన సంస్కారము బోధ సేయని గురుల్ బ్రహ్మాండమందెచ్చటన్
గనరాదైనను బెక్కురీ జగతిలో గన్పించుచున్నారు దు
ర్జనులవ్వారికి నీవె నేర్పెదవు వక్రత్వంబహంకారమా!! ప. 35

ఇలా ఎన్నెన్నో పద్యాలు, ఎన్నో హితోక్తులు, చమత్కారాలు, చురకలు, వ్యంగ్యబాణాలు, అనుభవాలు, ఆవేదనలు, విశ్లేషణలు... అన్నీ ఆలోచింపజేస్తాయి.

డా!! కడిమిళ్ళ వరప్రసాద్‌గారు నేటితరం అవధానులలో మొట్టమొదటి శతావధాని. తూ.గో.జిల్లా పాడగట్లపల్లి S.P.S.S.R. ఓరియంటల్ కళాశాలలో విద్యార్థిగా ఉండగా 1978లోనే మొదటి శతావధానం చేసినవారు. ఆలోచనాశీలి. తాను తనంతటి సహస్రావధానులుగా ఇద్దరినీ, శతావధానులుగా మరో ఇద్దరినీ తీర్చి దిద్దిన దీర్ఘదర్శి, మార్గదర్శి.

నేను భాషాప్రవీణ విద్యార్థిగా ఉన్నప్పుడు కడిమిళ్ళవారి పద్యమ్మునెవడురా పాతిపెట్టెదనంచు ఉన్మాదియై ప్రేలుచున్నవాడు అనే పద్యం విని, ఆయనకు అభిమానినయ్యాను. అప్పుడు ఆయనను కలిసి నాపద్యాలు వినిపించాలనుకొనేవాణ్ణి. ఆతరువాత ఆకాశవాణి వేదికపైన కలిశాం. స్నేహపూర్వకంగా, ఆత్మీయంగా మాట్లాడుతారు. ఏ విషయంలోనైనా స్పష్టంగా ఆయన అనుకున్నది చెబుతారు. అదే స్పష్టత ఈ శతకంలోనూ ఉంది.

ఈ అహంకార శతకం చదివితే శ్రీకడిమిళ్ళవారిపైన, ఈ శతకంపైన మీకు ఏర్పడుతుంది మమకారం. ఈ అహంకార శతకానికీ, శతక కర్తకూ నా అహంకారం నమస్కారం చేస్తోంది.

**జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు**

భాగ్యనగరం,
18.12.2009.

# పీఠిక

పౌరాణిక సార్వభౌమ

## జటావల్లభుల జగన్నాథం

### శ్రీమద్గురు చరణారవిందాభ్యాం నమః

అది శ్రీకరమైన వసిష్ఠా తటినీ తటమున ముహుస్సరస్వతీ స్థాయిత నాట్యరంగమని ప్రసిద్ధి గాంచిన నరసాపురము. అందునెందరెందరినో విద్యావంతులుగా నొనర్చిన టేలర్ ఉన్నత పాఠశాల. అట్టి విద్యా సంస్థలో 20వ శతాబ్దములో అంబరుఖా జయరామారావుగారు,శ్రీపాద సూర్యప్రకాశరావుగారు, వాలనాయకం పిళ్ళేగారు, వేమూరి రామగోవిందశాస్త్రిగారు, దర్భా జగన్నాథశాస్త్రిగారు, శిష్టా వేంకట సుబ్బయ్యగారు, మున్నగు నుత్తమ దేశికోత్తములుండుటవలన నరసాపుర ప్రఖ్యాతి దశదిశల విస్తరించినది. ఈ 21వ శతాబ్దములో ఉన్నతపాఠశాలయొక్కయు, నరసాపురముయొక్కయు కీర్తిప్రతిష్ఠలను ఇనుమడింప జేయుటకు పరమేశ్వరుడు కడిమిళ్ళవారిని నరసాపుర నివాసిగా, టేలర్ ఉన్నతపాఠశాల ఆంధ్రభాషా పండితునిగా ఏర్పరించుట ముదావహమైన విషయము. ఇంటిపేరు కడిమిళ్ళ, వరప్రసాద్ సార్థకమైన పేరు. భారతీపుత్ర తగిన బిరుదము. అష్టావధానియై, శతావధానియై, ద్విశతావధానియై, యుగళ సహస్రావధాన స్రష్టయై, తన శిష్యులను అష్టావధానులుగా, శతావధానులుగా, సహస్రావధానులుగా తీర్చిదిద్దిన ఒకే ఒక గురు సహస్రావధానియై ఆంధ్రదేశములోనే కాక భారత దేశమంతటను మరియు దేశాంతరములలో కూడ తన అవధాన కళా కలాపముచే నందరిని మగ్ధుల జేసి, తల్లిదండ్రులకును, వంశమంతటికిని, గురువర్యులకును, జన్మస్థలమైన ఏడిద గ్రామమునకును, తన నివాసమైన నరసాపురమునకును గౌరవకారణమైన

వ్యక్తి యితఃపూర్వము అమృతవర్షిణి, త్యాగసింధువు అను కావ్యములలో నవరస వర్షములను వర్షింపజేసి, పెంపుడు చిలుక అను ప్రబంధమున అసాధారణ కల్పనా చాతురిని ప్రదర్శించి, అనన్య సామాన్యమైన ఏడుచేపలు కావ్యమున గూఢార్థ ప్రకటనమునవాయాసముగా ప్రకటించి, మున్ను తాంబూలము అను చిఱు పొత్తము ద్వారా వ్యంగ్యార్థ కవితా వైభవమున పాఠకుల మనస్సులను పెద్దమొత్తముగా కొల్లగొట్టి, ఉత్తమ కవిగా పేరొందిన డా!!కడిమిళ్ళ వరప్రసాద్ గారు అహంకార శతకము అను రచనద్వారా తమ రచనా కౌశలమును ఒక క్రొత్తకోణములో ప్రదర్శించుట మఱింత ముదావహమైన విషయము. వరప్రసాద్ గారి జన్మస్థలము తూ.గో.జిల్లా ఏడిద. తలిదండ్రులు భారతీ వేంకటరామయ్య శాస్త్రి దంపతులు. గురువర్యులు శ్రీపాద లక్ష్మీనారాయణ శాస్త్రి, రావూరి వేంకటేశ్వరులు, అత్తిలి గోపాల కృష్ణమాచార్యులు, ఆచార్య కొంపెల్ల రామసూర్యనారాయణ, కె. కోటారావు వంటి ఎందరో మహనీయులు. సోదరీమణులు శ్రీమతి బాలాత్రిపుర సుందరి, శ్రీమతి కాత్యాయని, శ్రీమతి శ్రీదేవి, శ్రీమతి సుజాత. కుమారులు చి!! రమేష్ ఎమ్.సి.ఎ (పద్యకవి), చి!! శ్రీవిరించి ఒ.బి.ఎ (పద్యకవి). ధర్మపత్ని శ్రీమతి మీనాక్షి తెలుగు పండిట్ టేలరున్నత పాఠశాల నరసాపురం (పద్య కవయిత్రి).

శతక వాఙ్మయము దైవభక్తిని, పాపభీతిని, నైతిక ధార్మిక విషయములను స్పష్టీకరించుచు మానవత్వమునుండి దైవత్వములోనికిని, దైవత్వమునుండి బ్రహ్మత్వములోనికిని తీసికొనిపోగలిగిన పరమ పవిత్ర గంగాస్రవంతిగా పేరెన్నిక గన్నదై యున్నను, శతక కవులు భగవన్నామమును మకుటముగా చేసి, తమ రచనమును కనపరచుట జగత్ప్రసిద్ధమైన విషయము. శతక రచనములో శ్రీకాకుళాంధ్రదేవ మకుటముతో కాసుల పురుషోత్తమ కవి వ్యంగ్యరచన మనోహరముగా చేసినాడు. చంద్రశేఖర శతకము విచిత్రతను సంతరించుకొన్నది. మకుటము చంద్రశేఖరా అనియుండును. కాని ఆ శతకము గ్రామ్యభాషలో మూర్ఖుని మూర్ఖత్వము తెలుపుచుండును. సదరు శతక కవి నామధేయమేదియో

యెవ్వరికిని తెలియుటలేదు. అని యెంచును మూర్ఖుడు చంద్రశేఖరా! అని మకుటముండును. మొదటి పద్యము, చివరి పద్యము గ్రాంథికభాషలోనుండును. మిగిలిన పద్యములన్నియు గ్రామ్యభాషలో నుండును. గ్రామ్యంబు తత్తజ్జాతి వర్ణనంబునం బ్రయోగార్హంబగు అను ప్రౌఢవ్యాకరణ సూత్రమునకు

ఉదాహరణముగా నుండును.

కడిమిళ్ళవారు ఆ ధోరణిలోనే కవితలో తీవ్రతను చూపించినను, రచన మాత్రము గ్రాంథికముగానే సాగినది. ఈయన వినయ వివేక సంపదల పెన్నిధి. నిరంతరము చిఱు నవ్వుతో నలరారు దర్శనీయ ముఖారవిందులు. ఎన్నడు నేను వారిలో కోపమును గాని, గర్వమును గాని చూడలేదు. ఇట్టి నిరహంకార స్వరూపులు అహంకారమా! అను మకుటంతో ఈ శతకమును రచించుట ఒక ప్రత్యేకతను ప్రకటించుచున్నది. వీరు అహంకారము లేనివారు కావున అహంకార కలితులైన అజ్ఞానులకు గుణపాఠము చెప్పుటకై ఈ శతకముద్వారా అహంకారమును చీచీ పో అని తరిమికొట్టగలిగినారు.

ఇక వీరి పద్యములలోని సౌందర్యమును పరిశీలింతము. మొదటి పద్యము శ్రీకారముతో ప్రారంభింపబడినది. ఇది ఛందశ్శాస్త్ర నియమానుసారముగ నున్నది. రసవిషయమును పరిశీలింపగా నిందలి 100 పద్యములలోను వీర రసము గోచరించుచున్నది. దీనికి రౌద్రరస విజృంభణము తోడుగా నున్నది. పోపొమ్మహంకారమా! రేరే యహంకారమా! ఏబ్రాసీ యహంకారమా! వృశ్చికపు పుచ్ఛంబీవహంకారమా! ఓసీ యహంకారమా! చీచీ యహంకారమా! ఇత్యాది మకుటములతో కూడిన పద్యములు వీర రౌద్రరస సమ్మేళనమునకుదాహరణములు. లోకోక్తులు, జాతీయ పదప్రయోగములు, సందర్భోచితముగా నీ శతకములో రమ్యముగా పొదుగబడినవి. తలలో దూరి, రూకల్ నాలుగు వచ్చిపడ్డవని, కారాల్ నూరుచు నూరుచున్ మిరియముల్,

గ్రహపాటో పొరబాటొ, గోటన్ బోయెడిదానికిన్ పూవే ముల్లయి, గోవే బెబ్బులి యౌట, బొట్టును బెట్టి రమ్మనుచు, పెదవుల్ నవ్వగ వెక్కిరింపగ నొసల్, త్రాడే పామయి కాటువేసిన, గురువిందల్ తనక్రిందనున్న నలుపున్ ఇత్యాదులీ శతకమున కత్యంత రామణీయకమును చేకూర్చినవి.

ఒకటే మంచము నొక్కకంచము వంటి ప్రయోగములు ఆయా పద్యములకెంతయో వన్నె తెచ్చినవి. నరసాపురము టేలరున్నత పాఠశాలలో గతశతాబ్దములో తెలుగుపండితులుగానున్న శిష్టా వేంకటసుబ్బయ్యగారు గుండెల్ తీసినబంటు, మేకవన్నె పులులు మొ!! ప్రయోగాలు చేసారు వారి సమయోచిత పద్య రత్నావళి, దూర్వాస రామాయణము మున్నగు కృతులలో ప్రయోగించారు. ప్రస్తుతము 21వ శతాబ్దములో అదే పాఠశాలలో పండితులుగా నున్న శ్రీ కడిమిళ్ళవారుకూడ ఈ శతకములో 46వ పద్యములో గుండెల్ తీసినబంటు, 100వ పద్యములో మేకవన్నె పులులై వంటి ప్రయోగములు చేసారు. తలమే బ్రహ్మకునైన అను అల్లసాని వారి ప్రయోగము ఈ శతకములో 80వ పద్యములో ప్రయుక్తమైనది. ఈవిధమైన పద ప్రయోగములను బట్టి ఈ గురు సహస్రావధానిగారికి పూర్వపు కవుల పట్ల గల గురుభావము ప్రస్ఫుటమగుచున్నది. సంస్కృత జాతీయములను రసానుగుణముగా ప్రయోగించుటలో కడిమిళ్ళవారు సిద్ధహస్తులు. ఉదాహరణకు కాలో గచ్ఛతి ధీమతాం, సహవీర్యం కరవావహై, జ్ఞాతిశ్ఛేదనలేన కిమ్ మున్నగునవి కవి రసపోషణ విశేషములను చాటుచున్నవి.

తన మనస్సులోని భావము ననాయాసముగా సూటిగా పద్యరచనలో వ్యక్తము చేయు సామర్థ్యము కడిమిళ్ళవారి సొత్తు. అవధాన విధానములోను, గ్రంథరచనా కౌశలములోను వీరి భావ ప్రకటన హృదయాహ్లాదకరముగా నుండుట సర్వజన విదితము. మానవుని అధోగతిపాలు చేయు అహంకారమును తరిమికొట్టవలెనను భావము ప్రతిపద్యములోను కొట్టవచ్చినట్లు కనిపించుచున్నది. అహంకార కారణముగా మానవుడు మిత్రద్రోహము,

గురుద్రోహము మున్నగు పాపభావములకు పాల్పడుచున్నాడను విషయము ఈ శతకములో వీరు నిష్కర్షగా తెలియజేసి, లోకుల అజ్ఞాన దోషమును నిరస్తము చేయుటకై చేసిన ఈ రచన సర్వులకును మార్గదర్శకమై యున్నది. కనులందెఱ్ఱిని జీర రాని అను 12వ పద్యములో వాణీ స్థానమైనట్టి జిహ్వాకు బారుష్యపు పూత పూసెదవు అని అహంకారముయొక్క దుశ్చర్యను తెలుపుటలో చక్కని పదసంపుటిని ప్రదర్శించినారు. 19వ పద్యములో రెట్టింపు దోర్బలమున్ జూపెదు అని యంతటితో నాగక చావవు కదే! అని అహంకారముపై భావావేశము ప్రదర్శించుట చాల యుక్తియుక్తముగా నున్నది. 24వ పద్యములో నేనే నీవని నీవె నేననుచు ఈనాటి సీరియల్సు, సినీమాలలో వచ్చు వాడుక పదముతో ప్రారంభించి, సల్లక్షణోద్యానమందలి శిష్ట భృంగతతిచే అని పద్యమును ఆలంకారికులామోదించునట్లు రచించుటలో ఈ కవితల్లజుని రచనా చాతుర్యమానంద దాయికముగా నున్నది.

47వ పద్యములో అతిథుల్ వచ్చుచు పోవుచుంట అని తెలిపి ఓ అహంకారమా! నీవు వచ్చితివా వీడక తిష్ఠ వేసెదవు అను నుడికారము పొదుగుటలో స్వభావోక్త్యలంకారములో అహంకారముయొక్క స్వభావము రసజ్ఞుల మనఃకంజములను వికసింపజేయుచున్నది. 53వ పద్యము గురునిన్ వంచన చేయగా అని రచించుటలో ప్రస్తుత కలికాల ప్రభావము గురునింద చేయుటకు అంకారమే మూలమని తెలిపిన సందర్భము గురుద్రోహులకు గుణపాఠము చెప్పు తీరు మనోజ్ఞమగుచున్నది. 57,59 పద్యములలో కవివర్యుల ప్రాస నిర్మాణ కౌశలమును, పదమధ్య యతి ప్రయోగ సౌందర్యము మనోజ్ఞమై, పద్యగమనము అశ్వము నడకను పోలియున్నది. 91వ పద్యములో చివర కాబోలహంకారమా! అనుటలో అయి యుండవచ్చును అనుభావముతో బాటు కాబోలు వాళ్ళ అప్పు ఎంత బాధ పెట్టునో అహంకారమంత తీవ్రమైన మనస్తాపమును కల్గించునను అర్థమును ధ్వనింపజేయుచు హృదయంగమముగా నున్నది. 99వ పద్యములో చిన్నదియో పెద్దదొ గద్దె అను రచనలో చెళ్ళపిళ్ళ

వేంకట శాస్త్రిగారు ఆస్థాన కవియైనపుడు ఏదే పెద్దది గద్దె అని రచించిన పద్యమును స్ఫురింప జేయుచున్నది.

పాఠకులీ అహంకార శతకమునవధానతతో చదివి, భావమును హృదయమునకు హత్తించుకొని, నిరహంకారస్థితిని లోకమునకు బోధించుచు నీ పద్యములను శ్రోతలకు వినిపించి, అహంకారమునుండి జీవులు విముక్తులై భగవదనుగ్రహమునకు పాత్రులై తరించునట్లుగా చేయవలసినదని నా ఆకాంక్ష.

నేను కొన్ని పద్యములలోని సొగసును మాత్రమే చూపితిని. ప్రతి పద్యములోని హొసును చూపినచోనదియొక బృహద్గ్రంథమగును. ఈ పీఠికా పఠనము చదువరులకు గ్రంథమును సాకల్యముగా తిలకించుటకు దోహదము చేయునని నా విశ్వాసము. తెలుగులోనే కాక సంస్కృతములో కూడ గురువందనమ్, దాసోహమ్ వంటి రచనలను లోకానికి అందించిన, అందిస్తున్న ఆయుష్మంతులు కడిమిళ్ళ వరప్రసాద్‌గారు ఇంకను మంచి మంచి రచనలు చేసి, నీతిని ధర్మమును లోకమునకు అందజేయుదురని నా భావన. అహంకార శతకమును రమ్యముగా రచించిన ఈ కవివర్యులు మమకార శతకమును గూడ రచించి, యావదాంధ్ర దేశములోన ఇతోధిక యశోవిస్తారముతో వర్ధిల్లవలెనని ఆశీర్వదించుచున్నాను.

**జటావల్లభుల జగన్నాథము వ్రాలు**
**శ్రీవిరోధి పౌష శుద్ధ ఏకాదశీ ఇందువాసరము**
**(ముక్కోటి ఏకాదశీ మహాపర్వము)**
**కైకరము, ప.గో.జిల్లా**

# అహంకార శతకము

1. శ్రీకారమ్మును జుట్టుచుంటినిదె నీ చేష్టావిశేషమ్ములీ
లోకంబందుననెన్ని వింతగతులన్ రూపమ్ములన్ మార్చుచున్
బ్రాకామ్యమ్మున సంచరింపగలవో వర్ణించి, పద్యాకృతిన్
నీకారుణ్యము గోరి పల్కుటకునై నిక్కమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! నీ చేతలు ఈలోకంలో ఎన్ని మార్గాలలో రూపాలు మార్చుకొంటూ ఎలా స్వేచ్ఛగా సంచరిస్తాయో పద్యాలలో వర్ణించి, నీ కారుణ్యాన్ని పొందాలనుకొని శతకానికి శ్రీకారం చుడుతున్నాను. నిజము. (నీవు నాదరికి రాకుండుటయే నీవు చూపించవలసిన దయ అని భావము)

2. తలలో మద్గురుమూర్తి దూరి, కల చెత్తన్ బూర్తిగానూడ్చి, ని
ర్మల విజ్ఞాన జలమ్ముతో గడిగి, సారస్యమ్మునే రంగవ
ల్లులుగా దిద్ది, యలంకరించినది ధూర్తుల్ కాపురమ్ముంటకా!
నిలువన్‌రాదిట నీకు, నీ గృహము కానే కాదహంకారమా!!

తా.. ఓ అహంకారమా! నా తలలో గురుమూర్తి ప్రవేశించి, అక్కడ ఉన్న అజ్ఞానమనే చెత్తను పూర్తిగా ఊడ్చి, విజ్ఞానమనే నీళ్ళతో కడిగి, సారస్యమనే రంగవల్లులను దిద్ది అలంకరించినది ఆ ఇంట్లో దుర్మార్గులు కాపురముండేందుకా? ఇక్కడ నీకు చోటు లేదు. ఇది నీ ఇల్లు కానేకాదు.

3. తలలో దూరి గురుండు స్వర్ణమును మొత్తమ్మందునన్ నిల్పుటన్
విలువల్ హెచ్చెను నాకు లోకమున, దద్విజ్ఞాన కాంతిచ్ఛటల్
నలుదిక్కుల్ ప్రసరించు కాలమున విన్నాణమ్ము పోద్రోలి, నా
తలపైకెక్కుట తాండవించుట ప్రశస్తమ్మా! యహంకారమా!!

తా.. ఓ అహంకారమా! నా గురుడు తలలో దూరి, మంచి అక్షర సముదాయమనే బంగారమును మొత్తముగా అక్కడ ఉంచుటచే లోకంలో నాకు విలువ పెరిగింది. ఆ విజ్ఞానముయొక్క (బంగారముయొక్క) కాంతులు నాలుగు దిక్కులకు ప్రసరించే కాలంలో వివేకం పోగొట్టి, నా తలపైకెక్కి తాండవం చేయుట మంచిపనేనా?

4. పలుగ్రంథమ్ములు చూడగా, జదువగా, బల్కాడగా, వ్రాయగా
గలిగెన్ శక్తి రవంతగా గురుకటాక్షశ్రీ సముత్కర్షచే
విలువల్ చచ్చి, మదమ్ము హెచ్చి, గురులన్ వేమారు నిందించు దు
ర్బలునిన్ జేయగనేల నన్ను విడిపోరాదే! యహంకారమా!!

తా.. ఓ అహంకారమా! ఎన్నో గ్రంథాలు చూచుటకు, చదువుటకు, పలుకుటకు, వ్రాయుటకు తగిన శక్తి రవ్వంత కేవలం గురు కటాక్షముయొక్క ఆధిక్యముచేతనే నాకు లభించింది. విలువలు చచ్చి, గర్వం పెరిగి, గురువులనే పలుమార్లు నిందించే దౌర్బల్యాన్ని నాకెందుకు కలిగిస్తావు. నన్ను విడిచిపెట్టి పోరాదా.

5. రూకల్ నాలుగు వచ్చిపడ్డవని నాలోనన్ బ్రవేశించితే
నాకన్నుల్ తలమీద పెట్టితివి యానందమ్ము పోకార్చితే
చీకాకుల్ పదివేలు తెచ్చితివి యోసీ! నీదియున్ జన్మమే
పోకాల్మన్నను సిగ్గు లేదటవె పోపొమ్మా! యహంకారమా!!

తా... ఏవో నాలుగు రూకలు వచ్చిపడ్డాయని, నాలో ప్రవేశించి, నా కళ్ళు నెత్తికెక్కించి, యానందాన్ని పోగొట్టావు. పదివేల చీకాకులు తెచ్చిపెట్టావు. ఓసీ! నీదీ ఒక బ్రతుకేనా? పొమ్మన్నా సిగ్గులేదా? పో పోవే! యహంకారమా!

6. చదువుల్ నేర్వక మున్ను నీ యునికి మత్స్వాంతమ్మునన్ లేదు నె
మ్మదిగా బొత్తము పట్టగా గురుదయా మాహాత్మ్య లేశమ్ము నా
మెదడున్ శుభ్రము చేసి, జ్ఞానసుధ చిమ్మెన్ దత్ క్షణమ్మందు నా
యెదలో దూరితి తిష్ఠ వేసితివి నీవేలా! యహంకారమా!!

తా... చదువుకోక ముందు నా మనస్సులో నీ ఉనికి కూడా లేదు. నెమ్మదిగా పుస్తకాన్ని పట్టుకొన్నాను. ఏ కొంచెమో గురువుగారి మాహాత్మ్యం నా మెదడును శుభ్రం చేసి, జ్ఞానమనే అమృతాన్ని చిమ్మింది. అంతే వెంటనే నీవు నా మనస్సులో దూరి తిష్ఠ వేసేసావు ఎందుకే అహంకారమా?

(తిష్ఠవేయుట అనునది లోకవ్యవహార అనుకరణము)

7. నాకున్ నీకును బంధమెవ్విధిని సంధానించెనో బ్రహ్మ నా
కో కైమోడ్చుట జీవలక్షణము నీకో శిష్టధిక్కార వి
ద్యాకార్కశ్యము ముఖ్యలక్షణమ యీ దాంపత్యమెట్లుండునో
చీకాకుల్ వలదే విడాకులివిగో చేకొమ్మహంకారమా!!

తా... నాకూ నీకూ ఆ బ్రహ్మ ఏవిధంగా జత కూర్చాడో? నాకేమో అందరికీ వినయంగా నమస్కరించడం జీవలక్షణం. నీకేమో ఉత్తములను ధిక్కరించడమనే కఠినత్వమే ముఖ్యలక్షణం. మనదాంపత్యం ఎలా ఉంటుంది? ఈ చీకాకులు వద్దుగాని విడాకులు ఇవిగో! తీసికోవే అహంకారమా!

8. నుడులన్ నాలుగు నేర్చుకొంటినని నన్నుం జేరి, నానెత్తిపై
బడి తైతక్కలనాడి, కష్టపడి సంపాదించుకొన్నట్టి పు
త్తడితో దూగెడి గొప్పకీరితిని విధ్వంసమ్ము గావించితే
నడిసంద్రమ్మున నన్ను నెట్టుటయ పంతమ్మా! యహంకారమా!!

తా.. ఏవో నాలుగు అక్షరాలను నేర్చుకొన్నానని నన్ను చేరి, నా నెత్తిమీదపడి, తైతక్కలాడి, కష్టపడి సంపాదించుకొన్న బంగారంలాంటి మంచి కీర్తిని నాశనం చేసావు గదే! నన్ను నడి సముద్రంలోకి గెంటెయ్యాలని పంతం పట్టావా అహంకారమా?

9. నీపంతమ్మది పాడుగాను జనహృన్నేరేజ బంధుండనై
ప్రాపున్ గాంచిన నాదు జన్మమునకున్ బంకమ్మునంటించితే
రాపాడించితి పీడబెట్టితివి ఘోరంబైన నీ మైత్రితో
మాపున్ తేపునవస్థలన్ బడితి బొమ్మా పొమ్మహంకారమా!!

తా... నీ పంతం పాడుగాను. ప్రజల హృదయపద్మాలను వికసింపజేసే సూర్యునిగా పేరు పొందిన నా జన్మకు బురదనంటించావు గదే! రాపాడించి, పీడబెట్టావు. ఘోరమైన నీ స్నేహంతో అన్నివేళల అవస్థల పాలైపోయాను పోవే పో అహంకారమా!

10. ఋషితుల్యమ్ముగ నా జనిన్ గడపుచున్ హృద్యంబుగా సాహితీ
కృషి సాగించి రసార్ద్రమైన జగతిన్ సృష్టించి, క్రీడించుచు
సుషమాచ్ఛాదిత కీర్తివైభవముతో శోభించు నాగుండెలో
విషమున్ నింపగనేల చాలునిక పోవే పొమ్మహంకారమా!!

తా... ఒక ఋషిలాగా జీవితాన్ని గడుపుతూ, మనోహరంగా సాహిత్య కృషిని కొనసాగిస్తూ, రసంతో తడిసిన ప్రపంచాన్ని సృష్టించి, అందులో ఆడుకొంటూ, కాంతితో కప్పబడిన కీర్తివైభవంతో ప్రకాశించే నా గుండెలో విషాన్ని నింపడమెందుకు? చాలు ఇక పోవే అహంకారమా!

11. మమకారమ్మును గూడ వీడుమనుచున్ మాటాడినన్ మౌనిలో
కము, తద్ధర్మము పారలౌకికగతిన్ ఖండించునేమో యెఱుం
గము గానీ యిహమున్ బరమ్ము జెడు నిక్కమ్మీవు మమ్మంటుచో
సమతన్ బీలిచి, పిప్పి చేసెడి పిశాచమ్మా! యహంకారమా!!

తా.. మహర్షులు అహంకార మమకారాలు రెండింటినీ విడిచిపెట్టమంటారు. ఏమో! మమకారం పరలోక గతిని పాడుచేస్తుందేమో తెలియదు గాని, నీవు మమ్మల్ని అంటుకొంటే చాలు ఇహమూ పరమూ కూడా చెడిపోతాయి. సమతా భావాన్ని పీల్చి పిప్పిచేసే పిశాచానివే అహంకారమా!

12. కనులందెల్లని జీర రాని సహనోత్కర్షన్ బ్రకాశించు వా
నిని గోపార్ణవమందు ముంచెదవు వాణీస్థానమైనట్టి జి
హ్వను బారుష్యపు బూత పూసెదవు వహ్వా! నీ బలంబెన్న బా
వనికిన్ సాధ్యము కాదు కాదనుట భావ్యంబౌ నహంకారమా!!

తా... ఓ అహంకారమా! కళ్ళల్లో ఎఱ్ఱని జీరకూడా రాని గొప్ప ఓర్పుతో ఉండేవానిని కోపసముద్రంలో ముంచేస్తావు. సరస్వతికి నివాసమైన నాలుకపై కాఠిన్యపు పూత పూస్తావు. ఆహా! నీ బలం ఏపాటిదో తెలిసికోవడానికి భీమునికీ హనుమంతునికీ కూడ సాధ్యం కాదన్నది నిజం.(ఎంతటి పవిత్రుడైనా నీ బలాన్ని అంచనా వేయలేడు)

13. ఎన్నోయేండ్లు పరిశ్రమించినను గానీ రాని సత్కీర్తి య
న్నన్నా యొక్కముహూర్తమందు మటుమాయంబౌను నీ స్పర్శచే
నిన్నున్ ముట్టిన బైడి మట్టియగు బైనిన్ మానసోల్లాసమున్
ఛిన్నంబై చెడిపోవు నీవలననే ఛీఛీ యహంకారమా!!

తా... ఎన్నో ఏండ్లు ఎంతో శ్రమపడితే గాని సత్కీర్తి రాదు. ఆటువంటి కీర్తి నీవు తాకిన మరు క్షణంలో మటుమాయమైపోతుంది. నిన్ను ముట్టుకొంటే బంగారం మట్టిగా మారిపోతుంది. మానసిక ఉత్సాహం ముక్కలై చెడిపోతుంది. ఇదంతా నీవల్లనే ఛీఛీ అహంకారమా!!

14. కలనైనన్ గనరానియట్టిది కృతఘ్నుత్వంబు మస్తంబులో
మొలకెత్తున్ దలసూపు గన్నుగవలో బుష్పించుచున్ గుండెలో
ఫలియించున్గద మేనుమొత్తమదియే వ్యాపించి, వేళ్ళూను నీ
వలనన్ వద్దిక నీదు పొత్తు విడిపోవా! పొమ్మహంకారమా!!

తా.. కలలో కూడ చూడరానిది చేసినమేలు మరచిపోయి, తిరిగి కీడు చేయుట అనే కృతఘ్నుత. ఆ దుర్లక్షణం నీవల్ల తలలో మొలకెత్తుతుంది. కన్నుల జంటలో పుష్పిస్తుంది. గుండెలో ఫలిస్తుంది. శరీరమంతా అదే వ్యాపించి, వేళ్ళూనుకుంటుంది. నీ పొత్తు నాకు వద్దు. నన్ను విడిచిపెట్టి పోవా! పో అహంకారమా!

15. కలలో దోచినయట్లు వచ్చెదవు నిక్కమ్మౌదువాపైని ని
ర్మలమందాకినివంటి మా యెడదలో మత్తేభతుల్యమ్ముగా
జలకమ్మాడి, పవిత్ర సద్గుణ సరోజవ్రాత విధ్వంసన
మ్ముల గ్రీడింతువిదేమి చోద్యమకటా! పోపొమ్మహంకారమా!!

తా.. కలలోకి వచ్చినట్లు వస్తావు. తరువాత నిజమైపోతావు. నిర్మలమైన ఆకాశ గంగవంటి మా హృదయంలో ప్రవేశించి, మదించిన ఏనుగులా అందులో స్నానమాడుతావు. పవిత్రమైన మంచిగుణాలనే పద్మాలను నాశనం చేస్తూ ఆడుకొంటావు. అయ్యో! ఇదేమి చోద్యం. పో పో అహంకారమా!

16. కలనాదమ్ములు సేయుచున్ జిలుకవై కన్పట్టి, కుందేటి పి
ల్లలకున్ దోడయి, జింకపిల్లలను బోలన్ జెల్లి, యాపైని బె
బ్బులివై మీదికి దూకి, మాబ్రదుకుతో బోరాడి, జీవచ్ఛవ
మ్ములుగా మమ్ము మిగిల్చిపోదువటవే! పోపొమ్మహంకారమా!!

తా... ముందు తియ్యగా మాట్లాడే చిలుకలా కనిపిస్తావు. తరువాత కుందేటి పిల్లలా కనిపిస్తావు. పిమ్మట జింకపిల్లలా అగుపిస్తావు. ఆ తరువాత బెబ్బులివై మీదికి దూకి మా బ్రతుకుతో పోరాటం చేసి, మమ్మల్ని జీవచ్ఛవాలుగా మిగిల్చిపోతావట. పో పో అహంకారమా!

17. మఖముల్ సేయుచు బూజలన్ జలుపుచున్ మర్యాదగా సాగుచున్
సుఖమున్నట్టి జనాళి వెన్కబడి, మెచ్చుల్ వల్కుచున్ నెమ్మదిన్
శిఖలన్ బట్టెదవీడ్చివైచెదవు వాసిన్ గోలుపోవన్ బయో
ముఖహాలాహల కుంభమీవు గదటే! పోపొమ్మహంకారమా!!

తా... ఏవో యాగాలు, పూజలు చేసికొంటూ మర్యాదగా బ్రతుకుతూ సుఖంగా ఉన్న జనాల వెంటబడతావు. మంచిమాటలు చెప్పి దగ్గరై నెమ్మదిగా జుట్టుపట్టుకొని ఈడ్చేస్తావు. ఉన్న కీర్తిని పోగొడతావు. పైకి పాలు లోపల విషమూ ఉన్న పయోముఖ విషకుంభానివి కదే నీవు. పో పో అహంకారమా!

18. పాండిత్యమ్ము లభించెనో! ధనము సంప్రాప్తించెనో! శౌర్యము
ద్దండస్ఫూర్తి ఘటిల్లెనో! కవన సందర్భమ్ము వాటిల్లెనో!
నిండారన్ యశమబ్బెనో! యదియ చాల్ నేనుంటినంచున్ వడిన్
జిందుల్ వేయుచు వచ్చి వ్రాలెదవటే! ఛీఛీ! యహంకారమా!!

తా.. ఎవరైనా బాగా చదువుకొని పండితుడయ్యాడా, లేదా బాగా డబ్బు సంపాదించాడా, మంచి వీరుడయ్యాడా, చక్కని కవిత్వం చెప్పే శక్తి వచ్చిందా, దేశంలో కీర్తి ప్రతిష్ఠలు వచ్చాయా అది చాలు నేనున్నానంటూ వేగంగా చిందులు వేస్తూ వచ్చి వ్రాలిపోతావటగా! ఛీఛీ అహంకారమా!

19 బలవంతమ్ముగ నిన్ను బట్టుకొని, తీవ్రమ్మైన యత్నమ్ముతో
నులుమన్ గొంతును మాటిమాటికిని గంతుల్ వైచి, రెట్టింపు దో
ర్బలమున్ జూపెదుకాని చావవుగదే! రాకాసివై యీమను
ష్యుల బీడించెడి చీడవైతివికదే! యోసీ! యహంకారమా!!

తా.. ఓసీ అహంకారమా! నిన్ను బలవంతంగా పట్టుకొని, తీవ్రమైన ప్రయత్నంతో నీ గొంతు నులిమినా, నువ్వు చావవు సరికదా గంతులు వేస్తూ రెట్టింపు భుజబలాన్ని చూపిస్తావు. నీవొక రాక్షసివై ఈ మానవులను పట్టి పీడించే చీడవైపోయావు కదే!

20. కారాల్ నూరుచు నూరుచున్ మిరియముల్ గాంౘ్రించి తీంౘ్రించుచున్
గారుల్ ప్రేలెడి వెఱ్ఱిమానవులలో గన్పట్టు తప్పేమి య
వ్వారిన్ నీవు స్పృశింపకున్నయెడలన్ వైనమ్ములట్లుండునా
సారాసారములే యెఱుంగని పిశాచమ్మా! యహంకారమా!!

తా... కొందరు మానవులు చీటికి మాటికి కారాలు మిరియాలు నూరుతూ, గాంౘ్రిస్తూ తీంౘ్రిస్తూ ఇష్టం వచ్చినట్లుగా ప్రేలుతున్నారంటే అది వారి తప్పుకాదు. నీవు వారిని ముట్టుకొని ఉండకపోతే వారి విధానం అలా ఉంటుందా? సారము, అసారము ఎరుగని పిశాచానివే అహంకారమా!

21. గ్రహపాటో పొరబాటొ పాపఫలమో కాకున్న నేమూఢుడున్
సహవాసమ్మును జేయబోడుగద దుష్టశ్రేణితోబీ నీవు ప్ర
త్యహమున్ జెంతను నిల్చుచుండుటను దుర్వ్యాపారమాపాటిదౌ
నహహా! యయ్యది నీవిలాసమట! కాదా! పొమ్మహంకారమా!!

తా. గ్రహపాటో, పొరబాటో, పాపఫలమో కాకపోతే ఎట్టిమూర్ఖుడైనా దుష్టులతో సహవాసం చేయడుకదా! నీవు నిత్యం దగ్గరగా ఉండడంవల్ల అటువంటి తప్పుడుపని చేయాలనిపిస్తుంది. ఆహాహా! అదంతా నీ విలాసమట. కాదంటావా? పోవే అహంకారమా!

22. ఒకటే మంచము నొక్క కంచముగ నెన్నో యేండ్లు స్నేహామృతం
బకలంకమ్ముగ గ్రోలువారలకు గయ్యంబేర్పడన్ వింతలే
దుకదా! వారల లేతగుండియల లోతుల్ చేరి, దాగున్న నీ
దికదా! దోషము దుఃఖదాయివట కాదే! నీవహంకారమా!!

తా... ఒకే మంచం ఒకే కంచంగా ఎన్నో ఏళ్ళు మైత్రీ మాధుర్యాన్ని పంచుకొన్నవారు కూడా పరస్పరం కలహించుకోవడం ప్రారంభించారంటే అందులో వింతలేదు. వాళ్ళ లేత గుండెల లోతులలో దాగున్న నీదే ఆ దోషం. నీవు దుఃఖాన్నిచ్చేదానివట కాదంటావా అహంకారమా?

23. అత్తన్ గోడలు తిట్టిపోసినదియో! యారళ్ళతో నత్తయే
పెత్తందారుతనమ్ము చూపినదియో! వేర్పాటులేర్పాటులై
మొత్తమ్మిల్లొక గుల్లయై చిదికెనో! మూలమ్ము నీవేకదా!
కత్తుల్ నూరుట నీవు నేర్పినదియే కాదా! యహంకారమా!!

తా... అత్తను కోడలు తిట్టిపోసిందా? లేదంటే ఆరళ్లతో అత్తే పెత్తందారుతనం చూపించిందా? ఉమ్మడి కుటుంబం కాస్తా వేరుపడిపోయి, ఇల్లంతా గుల్లైపోయిందా? అన్నిటికీ మూలం నీవేకదా! కత్తులు నూరడం నీవు నేర్పినదే. కాదంటావా అహంకారమా?

24 నేనే నీవని నీవె నేననుచు నెన్నే రీతులన్ బల్కి, నా
లోనన్ జేరితివంతకున్ మునుపె నాలోనున్న సల్లక్షణో
ద్యానంబందలి శిష్టభృంగతతినే యల్లంత దూరానకున్
బోనాడన్ బనిపూనితీవు తగవా! పోపొమ్మహంకారమా!!

తా... నువ్వే నేను, నేనే నువ్వంటూ ఎన్నో రకాలుగా మాట్లాడి నాలో చేరావు. అంతకు ముందే నాలోని మంచి లక్షణాలనే ఉద్యానవనంలో ఉన్న గొప్పవారనే తుమ్మెదల సమూహాన్ని అల్లంత దూరానికి తరిమికొట్టడమే పనిగా పెట్టుకొన్నావు ఇది నీకు తగునా! పోపో అహంకారమా!

25. పంతమ్మేలకు నీకు మిత్రతను విధ్వంసమ్ము గావింపగా?
సంతోషమ్ము సమైక్యతత్త్వమున నిచ్చల్ దాగియుండున్ గదా!
గంతల్ కట్టిన కన్నుదోయికిక లోకమ్మెట్లు కన్పించు నీ
పొంతన్ మాకు వివేకముల్ నిలుచునా! పోపొమ్మహంకారమా!!

తా... మైత్రిని విధ్వంసం చెయ్యాలనే పంతం నీకెందుకు? కలసి మెలసి ఉండడంలోనే ఎల్లప్పుడూ సంతోషం దాగి ఉంటుంది కదా! అయినా, గంతలు కట్టిన కళ్ళకు లోకం కనిపిస్తుందా? నీ దగ్గర నిలిచిన మాకు వివేకం నిలుస్తుందా? పో పో అహంకారమా!

26. తలిదండ్రుల్ గురువుల్ విశిష్టజనముల్ తథ్యమ్ముగా గౌరవా
ర్హులు తత్సత్యమెఱింగియున్ బలుకు పారుష్యమ్ము చూపించువా
రల తప్పేమి, గతమ్మునందున బవిత్రమ్మైన యమ్మానస
మ్ములలో జేరిన నీవిలాసములవే పోపొమ్మహంకారమా!!

తా... తల్లిదండ్రులు, గురువులు, ఇంకా, గొప్పవారు తప్పనిసరిగా గౌరవింపదగినవారు అనే సత్యం తెలిసికూడ వారియెడల పలుకులలో కాఠిన్యాన్ని చూపిస్తున్నారంటే అది వారి తప్పుకాదు. ఇంతకుముందు పవిత్రంగానే ఉన్న వారి మనస్సులలో చేరిన నీ విలాసాలే అవి. పో పో అహంకారమా!

27. రసనాగ్రమ్మొక శ్వేతపద్మనిభమై, బ్రహ్మాణికిన్ బీఠమై
రసవద్వాక్య లతాంతమాలికల నర్చల్ సేయు సాహిత్యలా
లసులే మంచి చెడుల్ స్మరింపకయ వైరస్యమ్ములన్ బల్కుచో
విసుమానంబదియేల వింతలవి నీవే సుమ్మహంకారమా!!

తా... నాలుక కొన ఒక తెల్లని పద్మమై, సరస్వతికి పీఠమై, రసవంతమైన వాక్యాలనే పుష్పమాలికలతో అర్చనలు చేసే సాహిత్య ప్రియులే మంచి చెడు గుర్తింపకుండగా విరసంగా మాట్లాడుతున్నారంటే అందులో ఆశ్చర్యం ఏముంది? ఆ వింతలన్నీ నీవేసుమా అహంకారమా!

28. కాలోగచ్ఛతి ధీమతామనెడి వాక్యమ్మే ప్రమాణమ్ముగా
శీలమ్మున్ నిలబెట్టుకొంచు నుడులౌచిత్య ప్రపూర్ణమ్ములై
క్రాలన్ గుండియలో దయామృతము పొంగన్ నిల్చువారేని నీ
మ్రోలన్ దాసులుగా జరించెదరటే పోపొమ్మహంకారమా!!

తా... భారత భాగవత రామాయణాది సద్గ్రంథ పఠనంతో బుద్ధిమంతులకు కాలం గడుస్తుందనే వాక్యమే ప్రమాణంగా, శీలాన్ని నిలబెట్టుకొంటూ ఔచిత్యంతో కూడిన మాటలే మాట్లాడుతూ, గుండెలో దయామృతం పొంగే విధంగా ఉన్నవారుకూడా నీ యెడల దాసులుగా మారిపోతారట గదే పో పో అహంకారమా!

29. ఆమూలాగ్రముగా త్రయీపఠనమో, యాపైని షట్ఛాస్త్ర వి
ద్యామంజూషను నెత్తికెత్తుకొనుటో, యారూఢిగా సాహితీ
స్వామిత్వమ్ము గడించుటో సులభమై వర్తిల్లునేగాని, శి
ష్టామోదమ్ముగ నిన్ను గెంటుట యసాధ్యమ్మే యహంకారమా!!

తా... మొదటినుండి తుదివరకు వేదాన్ని చదువవచ్చు. అటుపై ఆరు శాస్త్రాలనే విద్యల పెట్టెను నెత్తిపై పెట్టుకోవచ్చు. ప్రసిద్ధంగా సాహిత్యంలో ప్రభుత్వాన్ని సాధించవచ్చు. ఇవన్నీ సులభమే కాని, మంచివారు మెచ్చేటట్లుగా నిన్ను గెంటడం మాత్రం అసాధ్యమే అహంకారమా!

30 సహవీర్యం కరవావహై యనుచు నిచ్చల్ శాంతిమంత్రమ్ముతో
సహవాసంబొనరించునట్టి గురుశిష్యవ్రాతమేనాడు దు
స్సహదుర్భాషలతోడ దిట్టుకొనుటల్ సాగించిరో తన్మనో
గృహమందప్పుడు నీవు దూరితివిపో రేరే! యహంకారమా!!

తా.. ఓసీ అహంకారమా! ఆ పరమాత్మ మన ఇద్దరినీ శక్తిమంతులను జేయుగాక, మన ఇద్దరినీ తేజోవంతులను చేయుగాక, మనమిద్దరం పరస్పరం ఎప్పుడూ కలహించుకొనకుందుముగాక అంటూ ఉపనిషత్ శాంతి మంత్రాన్ని పఠిస్తూ సహవాసం చేసే గురుశిష్యులు ఏనాడైతే దారుణమైన దుర్భాషలతో తిట్టుకోవడం ప్రారంభించారో ఆనాడు వారి మనస్సులనే ఇళ్లలో నీవు దూరిపోయావని అర్థం.

31. పారావారతరంగమాలికలు శుభ్రజ్యోత్స్నయున్ గూడుచో
నారూఢిం గొను వార్ధిచంద్ర మమకారౌన్నత్య బంధంబు, వి
ద్యారాకేందుడు శిష్యుడై గురుసముద్ర ద్వేషియై నిచ్చలున్
బోరాటమ్ములు సేయబూనుటలు నీ పున్నెంబహంకారమా!!

తా... స్వచ్ఛమైన వెన్నెలతో కూడినపుడు సముద్ర తరంగాలు ఉవ్వెత్తున లేస్తాయి. ఆ సముద్రానికీ చంద్రునికీ మధ్య ఉన్న ఉన్నతమైన పితాపుత్ర రూపమైన మమకార బంధం ఎంతో ప్రసిద్ధిని పొందింది. అలాగే విద్యాచంద్రుడు శిష్యుడైతే గురువు సముద్రునివంటివాడు. ఆ శిష్యుడే గురువును ద్వేషించి,ఆయనపై పోరాటం చేయడానికి పూనుకొన్నాడంటే ఆది నీ పుణ్యమే కదా అహంకారమా!

32. గోటన్ బోయెడిదానికిన్ వడివడిన్ గొడ్డళ్ళతో సిద్ధమై
పోటీగా దమకించుచున్ బయిపయిన్ బోటెత్తు సంద్రమ్ములై
యాటోపమ్మును జూపుచుండిరనుచో నవ్వారియందున్న నీ
యాటల్ గాక మఱేమి వింతగలదే యయ్యో! యహంకారమా!!

తా... గోటితో పోయేదానికి వేగంగా గొడ్డళ్ళు తెచ్చి, పోటీపడుతూ, పోటెత్తే సముద్రాలలాగా ఒకరిపై ఒకరు వారి వారి ప్రతాపాలు చూపిస్తున్నారంటే వారియందున్న నీ ఆటలు కాకపోతే వేరే వింత ఉందంటావా? అయ్యో! అహంకారమా!

33. సతియే ప్రాణమటంచునెంచు బతియున్ సర్వస్వమున్ నాకు
నా పతియే యంచు దలంచునట్టి సతియున్ వాదాడి
మారాడుచున్ వెతలన్ గ్రొత్తగ దెచ్చిపెట్టుకొనుచో వింతేమి
సంసారముల్ గతితప్పున్ గద నీవు కాలిడినచో గాదా! యహంకారమా!!

తా... తన ఇల్లాలే ప్రాణమని భావించే భర్త, నా సర్వస్వం నా భర్తయే అని తలచే భార్య ఒకరితో ఒకరు వాదులాడుకొంటూ, క్రొత్తగా కష్టాలు తెచ్చిపెట్టుకొంటున్నారంటే అందులో వింత ఏముంది? నువ్వు కాలు పెడితే సంసారాలు గతి తప్పుతాయి. కాదంటావా అహంకారమా?

34. మనసుండన్‌వలెగాని మంచినడతన్ మన్నించుచున్ బూలబా
టనుగా జీవిక దిద్దుకొంచు నొక స్పష్టంబైన లక్ష్యమ్ము పై
కొని మున్ముందునకేగవచ్చు గద లోకుల్ కాని యవ్వారి బు
ద్ధిని నీకై యిలుగట్టుకోవనుట సందేహమ్మహంకారమా!!

తా... మనసుండాలే గాని, మంచి నడవడికను మన్నిస్తూ, బ్రతుకును పూలబాటగా దిద్దుకొంటూ, ఒక స్పష్టమైన లక్ష్యాన్ని ఏర్పరచుకొని జీవితంలో ఎంతో పురోగతిని ఎవరైనా సాధించవచ్చు. కానిస అంతలో వారి బుద్ధిలో నువ్వు ఇల్లు కట్టుకోవనే విషయం సందేహమే కదా! అహంకారమా!

35. జననంబాదిగ జెట్టలౌ నరులు విశ్వంబందునన్ లేరు, పా
వనసంస్కారము బోధ సేయని గురుల్ బ్రహ్మాండమందెచ్చటన్
గనరారైనను బెక్కురీ జగతిలో గన్పించుచున్నారు దు
ర్జనులవ్వారికి నీవె నేర్పెదవు వక్రత్వంబహంకారమా!!

తా.... ఓ అహంకారమా! పుట్టుకతోటే చెడ్డవారు ప్రపంచంలో లేరు. మంచి సంస్కారాన్ని బోధించని గురువులు బ్రహ్మాండంలో ఎక్కడా కనపడరు. అయినా ఎందరో దుర్మార్గులు ఈ జగతిలో కనిపిస్తున్నారు. ఆ వంకర బుద్ధి వారికి నీవు నేర్పినదే.

36. కాషాయాంబరధారియై సకల సంగమ్ముల్ విసర్జించియున్
భాషాయోష యనుగ్రహమ్మునకు సత్పాత్రమ్ముగా నిల్చియున్
భూషింపన్ జగమెల్ల గీర్తిమయుడై పొల్పారినన్ గాని సం
తోషశ్రీ సువిదూరుడైన నది నీ దోషంబహంకారమా!!

తా... కాషాయం కట్టి, సకల సంగములను విడిచిపెట్టి, సరస్వతి అనుగ్రహానికి పాత్రుడై మంచి పండితుడై, ప్రపంచంలో మంచి కీర్తిప్రతిష్ఠలు తెచ్చుకొని కూడా సంతోషానికి దూరమైపోయాడంటే అది నీ దోషమే. అహంకారమా!

37. భవదీయాద్భుత శక్తికిన్ గొలత విశ్వంబందున్ లేదు నీ
వ్యవహారంబుల తీరుతెన్నులకు నే వైనంబునున్ లేదు గౌ
రవమో, విద్యయొ, విత్తమో కలుగుటే ప్రారబ్ధమై వారి క
న్గవలెల్లన్ దలపైని నిల్పుటలు నీ నైజమ్మహంకారమా!!

తా... ఓ అహంకారమా! నీ అద్భుత శక్తికి కొలత అనేది ఈ ప్రపంచంలోనే లేదు. నీ వ్యవహారాల తీరుతెన్నులకు ఒక విధానమంటూ లేదు. గౌరవమో, విద్యయో, ధనమో కలగడమే ప్రారబ్ధమై అవి కల్గినవారి కన్నులను వారి నెత్తిమీద పెట్టడమే నీ సహజగుణం.

38. ఈ విశ్వంబున భూమి యెంత? భువియందీ మానవుండెంత? యే
వేవో కొన్ని విశేషముల్ గలుగుచో నేమాయె నాపాటికే
యావేశమ్ములు, పెంకి పట్టుదలలూహాపోహ లారళ్ళు, మి
థ్యావాదమ్ములు నీ మహామహిమలే దండంబహంకారమా!!

తా. ఈ ప్రపంచంలో భూమి ఎంత? అందులో మానవుడెంత? ఏవో కొన్ని విశేషాలు కలిగినంతమాత్రంచేత ఏమయింది. ఆపాటికే ఆవేశాలు, పెంకి పట్టుదలలు, ఊహాలు, అపోహలు, ఆరళ్ళు, అసత్యవాదాలు ఇవన్నీ నీ మహామహిమలే. ఓ అహంకారమా! నీకు దండము.

39. పూవే ముల్లయి గ్రుచ్చుకొన్నయెడ దత్పుణ్యంబు నీదేసుమా
గోవే బెబ్బులియౌచు మ్రింగుటయు నీకున్ గల్గు నేర్పేసుమా
నావల్ నక్రములైనచో నచటి ప్రజ్ఞాశక్తి నీదేసుమా
నీవే మేటివి నీకుసాటి యిలలో నీవే యహంకారమా!!

తా... ఓ అహంకారమా! పూవే ముల్లై గ్రుచ్చుకొంటే అది నీ పుణ్యమే సుమా! ఆవే పెద్దపులియై మ్రింగిందంటే అది నీకు కల్గిన నేర్పే సుమా! నావలే మొసళ్ళు అయ్యాయంటే ఆ తెలివితేటలు నీవేసుమా! నీవే గొప్పదానివి. ఈ లోకంలో నీకు నీవే సాటి.

40. ఆడంగల్గు నెమళ్ళు పాడగలవా? యభ్యాసమున్ జేసినన్
బాడంగల్గు పికమ్ములాడగలవా? పంతమ్ముమై నేర్చినన్
ఆడన్, బాడగ, మాటలాడ, గవితావ్యాసంగమున్ జేయగా
బ్రోడల్ మానవులొక్కటే దొసగు నీ పొత్తే యహంకారమా!!

తా... ఓ అహంకారమా! ఎంత అభ్యాసం చేసినా ఆడగలిగిన నెమళ్ళు పాడగలవా? పంతం పట్టి నేర్చుకొన్నా పాడగలుగు కోయిలలు ఆడగలవా? ఆడుట, పాడుట, మాట్లాడుట, కవిత్వాన్ని చెప్పుట ఇన్నిటిలో సమర్థులు కేవలం మానవులు మాత్రమే. కానీ, ఒక్కటే దోషం. అది నీతో పొత్తు పెట్టుకోవడమే.

41. అధికారమ్మది దైవదత్తవరమై ప్రాప్తించు నద్దానిచే
వ్యధలన్ బాపగవచ్చు లోకులకు దౌర్భాగ్యమ్ము వాయన్ గ్రియా
సుధలన్ బంచగవచ్చు సజ్జనుల మెచ్చుల్ పొందగావచ్చు న
వ్విధి వక్రించెనొ! నీవు పెట్టినటులే పేచీ యహంకారమా!

తా. అధికారం అనేది దేవుడు ప్రసాదించిన వరం. దానిద్వారా లోకుల బాధలను పోగొట్టవచ్చు. దౌర్భాగ్యంతో బాధపడేవారికి సేవారూపంలో అమృతాన్ని పంచవచ్చు. సజ్జనుల మెప్పులు పొందవచ్చు. కాని విధి వక్రించి వారికి చెడ్డపేరు వచ్చిందంటే నీవేదో పేచీ పెట్టినట్లే అహంకారమా!

42. పలుకుల్ మెత్తగనున్న నెవ్వరయినన్ బాటింతురయ్యానతిన్
ములుకుల్ గ్రుచ్చినయట్లు పల్కిన హితమ్మున్ గూడ గాదందురే
తల నీ పుట్టగ మారునో యట విషార్ద్రమ్మైన వాగ్ధారయే
కలుగున్ గాని స్రవించునే సుధ భుజంగమ్మా! యహంకారమా!!

తా... మెత్తగా చెపితే ఎవరైనా వారి ఆనతిని పాటిస్తారు. ముల్లుతో గ్రుచ్చినట్లు మాట్లాడితే అది మేలుగూర్చే మాటే అయినా కాదంటారు. అయినా ఓ అహంకారమా! పాములవంటి నీకు ఏ తల పుట్టగా మారుతుందో అక్కడ విషంతో తడిసిన వాగ్ధారయే ఏర్పడుతుంది కాని, అమృతం స్రవిస్తుందా?

43. అవురా! గొడ్డలి చెట్టుకొమ్మయె సహాయంబౌట నా చెట్టునే
భువి గూల్చున్ గద! మాదు మస్తకములే పోషించుటన్ నిన్ను నీ
వ్యవహారమ్ములతోడ మా బ్రతుకు విధ్వంసమ్ము కావించు తు చ్ఛ
విధానంబుల బోవు వృశ్చికపు పుచ్ఛంబీవహంకారమా!!

తా... ఔరా! చెట్టుకొమ్మను సాయం తీసికొని, ఆచెట్టునే నేలకూలుస్తుంది గొడ్డలి. అలాగే మా తలలే నిన్ను పోషించడంతో నీ వ్యవహారాలతో మా బ్రతుకులనే విధ్వంసం చేస్తావు. ఓ అహంకారమా! తుచ్ఛవిధానాలతో నడచే తేలుకొండివి నీవు.

44. గారాబమ్ముగ నిన్ను జూచుకొనుటన్ గయ్యంబులన్ బెట్టి మా
వారిన్ దూరము చేయుచుండెదవు మా పంతమ్ములన్ బెంచి, సం
స్కారంబున్ బరిమార్చి, పూర్వపు ప్రతిష్ఠన్ నాశమున్ జేసెదే
రారాజైనను నీకు దాసుడగు నేత్రాసీ! యహంకారమా!!

తా... ఓసీ యాత్రాసీ! అహంకారమా! మేము నిన్నెంతో గారాబంగా చూసికోవడంచేత మాలోమాకు కయ్యాలు పెట్టి మా వారిని మాకు దూరం చేస్తూంటావు. మా పంతాలు పెంచి సంస్కారాన్ని పోగొట్టి పూర్వం సంపాదించుకొన్న కీర్తిని నాశనం చేస్తావు రారాజైన నీకు దాసుడే కదా.

45. శిష్టుండెవ్వడు దుష్టుడెవ్వడవనిన్ జిత్తమ్ము నీదైనచో
దుష్టత్వమ్ములు తోచు, గానియెడలన్ దోచున్‌గదా శిష్టతల్
నష్టమ్ముండునె నీవు దూరముగనున్నన్ దగ్గఱై యున్నచో
గష్టమ్ముల్ కలకాలమున్ మిగులు నిక్కమ్మే యహంకారమా!!

తా... ఓ అహంకారమా! లోకంలో మంచివాడెవ్వడు, చెడ్డవాడెవ్వడు. మనస్సు నీ వశమైతే చెడ్డతనం కనబడుతుంది, లేకుంటే మంచితనమే కనిపిస్తుంది. నువ్వు దూరంగా ఉంటే నష్టముండదు. నువ్వు దగ్గరగా ఉంటే కష్టాలే కలకాలం మిగులుతాయి నిజం.

46. గుండెల్ తీసిన బంటవీవుగద! మాకున్ గల్గు సంతోషముల్
బండల్ సేయుట నీకు బండుగగదే! పథ్యమ్ముపై రక్తి లే
కుండన్ జేసి ప్రియమ్ములన్ బలుకు మాయోపాయ పారీణమీ
వుండన్ మాకిక సౌఖ్యముల్ నిలుచునా యోసీ! యహంకారమా!!

తా... ఓసీ అహంకారమా! నువ్వు గుండెలుతీసిన బంటువు కదే! మాకు కలిగే సంతోషాలను బండలు చేయడమే నీకు పండుగ కదే! మేలు కలిగించే మాటలపై ఇష్టం లేకుండా చేసి, మెరమెచ్చు మాటలను పలికే మాయోపాయ నైపుణ్యం కలిగిన నువ్వు ఉండగా మాకింక సుఖాలు నిలబడతాయా!

47. అతిథుల్ వచ్చుచు బోవుచుంట సహజంబౌ గావుతన్ నీవు వ
చ్చితివా వీడక తిష్ఠ వేసెదవు ఛీఛీ! యన్న, బొమ్మన్న మా
బ్రతుకెల్లన్ మమునంటి పెట్టుకొనియే వర్తిల్లుచున్ మమ్ము దు
ర్గతిపాల్ సేసెదు మాకికన్ మిగులు చీకట్లే యహంకారమా!!

తా... ఓ అహంకారమా! అతిథులు వస్తూ పోతూ ఉండడం సహజమే కానీ, నువ్వు వచ్చేవో ఇంక తిష్ఠ వేసేస్తావు. ఛీఛీ అన్నా, పొమ్మన్నా, మా బ్రతుకంతా మమ్మల్ని అంటిపెట్టుకొనే ఉంటావు. మమ్మల్ని దుర్గతిపాలు చేస్తావు. నీవల్ల మాకింక చీకట్లే మిగులుతాయి.

48. తనకోపానలమందునన్ బ్రదుకు దగ్ధంబైన నెవ్వానికై
నను దన్మూలము నీవె నీ యునికి యున్నన్ గాని కోపాగ్నియున్
జనియింపం గలదే నిజమ్మునకు దోషంబంతయున్ నీది య
య్యును గోపమ్మును దిట్టిపోయును జనంబోసీ! యహంకారమా!!

తా... ఓసీ! అహంకారమా! ఎవరికైనా తన కోపాగ్నిలోనే తన బ్రతుకు దగ్ధమైపోతే అందుకు మూలం నువ్వే. నువ్వు దగ్గరకు చేరితే తప్ప ఎవ్వరిలోనూ కోపాగ్ని పుట్టదు. నిజానికి దోషమంతా నీదే. అయినా ప్రజలు కోపాన్నే తిటిపోస్తారు కదా!

49. ఎన్నో కష్టములన్ సహించిననుగానీ పల్కుటిల్లాలు ర
మ్మన్నన్ వచ్చునె మాదు గుండెగుడి గొల్వై యుండ నచ్చోట నీ
వున్నన్ వాణి సహించునే నిలుచునే యుండంగరాదిందు బొ
మ్మన్నన్ బోవటె సిగ్గులేదటవె హేయమ్మే యహంకారమా!!

తా... ఓ అహంకారమా! ఎన్నో కష్టాలు పడితే కాని సరస్వతి రమ్మంటే మాత్రం వస్తుందా? వచ్చి, మా గుండె గుడిలో కొలువు తీరినపుడు అక్కడకు నువ్వు చేరితే సహిస్తుందా ఆ వాణి నిలుస్తుందా? ఇక్కడ నువ్వు ఉండకూడదు పొమ్మని చెప్పినా పోవు సిగ్గులేదా? ఇది చాల హేయమైన పని.

50. అవురా! బొట్టును బెట్టి రమ్మనుచు నిన్నాహ్వానమున్ జేయువా
రెవరే! పిల్వని పేరటమ్ములకు నీవే వచ్చి యందుండిపో
దువుగాదే! యెవడబ్బ సొమ్మనుచు నిందున్ దొర్లి పొర్లాడ జూ
తువు మాగుండెల నాక్రమించెదవటే! దోషంబహంకారమా!!

తా... ఔరా! నిన్ను రమ్మని బొట్టుపెట్టి పిలిచేవారెవరు? పిలవని పేరంటానికి వచ్చి మా గుండెలలో చేరిపోతావు. ఎవడబ్బ సొమ్మని మా గుండెలను ఆక్రమించి దొర్లి పొర్లాడాలనుకొంటావు. ఇది చాలాదోషం.

51. కలిమిన్ బెంచెడి మార్గముల్ గలవసంఖ్యాకంబుగా నట్టి సొ
మ్ములు చేజారెడి త్రోవలున్ గలవు చెల్మల్ పొంగుటో క్రుంగుటో
కలుగన్ దానికినిందు హేతువొకటే కన్పట్టు నీతోడుతన్
జెలిమిన్ త్రుంచుటొ పెంచుటో నిజముగా చీచీ యహంకారమా!!

తా. ఓ అహంకారమా! లోకంలో సంపదను పెంచుకోవడానికి ఎన్నో మార్గాలున్నాయి. అలాగే సంపదను పోగొట్టుకొనే త్రోవలుకూడా చాలానే ఉన్నాయి. కాని స్నేహం పెరగడానికైనా తరగడానికైనా ఒకటే కారణం. నీతో చెలిమి చేయకపోతే మామధ్య మైత్రి పెరుగుతుంది, చేస్తే తరిగిపోతుంది. చీచీ!

52. కడలిన్ బుట్టియు బైకిలేచిన తరంగమ్మెంత యత్నించినన్
బడునేగాని దివిన్ స్పృశింపగలదా! ప్రజ్ఞాన్వితుండయ్యు దా
జెడునేగాని సుఖంబు చేకొనునటే శ్రేయమ్మునార్జించునే
నడుమన్ నీ సహవాసమున్ జరిపి, యన్నన్నా! యహంకారమా!!

తా. ఓ అహంకారమా! గొప్పదైన సముద్రంలో పుట్టినా తరంగం ఎంత ప్రయత్నించినా పడిపోతుందే తప్ప స్వర్గాన్ని తాకగలదా? అలాగే ఎంత తెలివైనవాడైనా మధ్యలో నీ సహవాసం చేస్తే చెడిపోతాడు తప్ప సుఖపడడు శ్రేయస్సును పొందడు అన్నన్నా!

53. ప్రతిభావంతుడటంచు మెచ్చుకొనుటో, పాదమ్ములన్ మ్రొక్కుటో
సతతంబున్ సహవాసమున్ జరుప నుత్సాహంబు చూపించుటో
క్షితిపై గొందరు చేయుచో జగతి నాకే సొంతమన్నంత యు
ద్ధతి చూపించుట నీ మహామహిమయే దండంబహంకారమా!!

తా. ఈ లోకంలో ఎవరో కొంతమంది ఎవరినైనా ప్రతిభావంతుడని మెచ్చుకోవడమో, పాదాలకు నమస్కరించడమో, ఎల్లప్పుడూ వానితో సహవాసం చేయడానికి ఉత్సాహం చూపించడమో చేస్తే, ఆపాటికే ఈ ప్రపంచమంతా నాకే సొంతమన్నంతగా పొగరుగా ప్రవర్తించుట నీ మహామహిమయే. ఓ అహంకారమా! నీకు నమస్కారం.

54. అతడే చెప్పుడు మాటలన్ వినును సత్యమ్మున్ విసర్జించు వ్య
క్తితకున్ దూరము చేరి నిల్చును గురుక్లేశమ్ము లెక్కింపడం
చితమైనట్టి కృతజ్ఞతన్ విడుచు నీ స్నేహమ్మె యెవ్వాని కు
న్నతిగా దోచునో! జారుపాటొదవు నానాడే యహంకారమా!!

తా... ఓ అహంకారమా! ఎవరికైతే నీ స్నేహం గొప్పదిగా కనిపిస్తుందో ఆనాడే వానికి జారుపాటు ప్రారంభమవుతుంది. అతడే చెప్పుడు మాటలు వింటాడు. సత్యాన్ని విసర్జిస్తాడు. వ్యక్తిత్వానికి దూరమైపోతాడు. తన ఉన్నతికోసం గురువు పడ్డ కష్టాన్ని లెక్కించడు. గొప్పదైన కృతజ్ఞతను విడిచిపెట్టేస్తాడు.

55. క్రొత్తల్ వింతలుగా స్ఫురించుటలు సారూప్యమ్ముగా దోచుటల్
పొత్తుల్ ప్రాతవి రోతగా మిగులుటల్ మూన్నాళ్ళ బంధమ్ములే
నెత్తిన్ బెట్టుక శాశ్వతత్వమును సందేహించుటల్ కల్గు నే
చిత్తంబందున నీవు చేరెదవొ యందే సుమ్మహంకారమా!!

తా... ఓ అహంకారమా! ఎవరి మనస్సులో నీవు చేరెదవో అందు క్రొత్త వింతగాను భావసారూప్యం ఉన్నట్లుగాను తోస్తుంది. ప్రాత స్నేహాలు రోతగా కనిపిస్తాయి. మూన్నాళ్ళ ముచ్చటగా ముగిసిపోయే బంధాలను నెత్తిన పెట్టుకొని, శాశ్వతమైన స్నేహాన్ని సందేహించే పరిస్థితి ఏర్పడుతుంది.

56. వటబీజమ్ముగ నుద్భవించెదవు నీ ప్రాగల్భ్యమేపాటిదా
ర్భటిగొంచున్ వటవృక్షతుల్యమగుచున్ వ్యాపించెదే యూడలన్
జటలన్ వేయుచు నాక్రమింతువు యశస్సామ్రాజ్యమా నీడలో
నెటులన్ సద్గుణ వల్లికల్ బ్రదుకు బోవే! పొమ్మహంకారమా!!

తా... ఓ అహంకారమా! నీ గొప్పతనం ఏమిటో గాని, ముందు మర్రివిత్తనంలా మాలో పుడతావు. ఆ తరువాత మర్రిచెట్టులాగా వ్యాపిస్తావు. ఊడలనే జడలను వేసికొని మా కీర్తిసామ్రాజ్యాన్ని ఆక్రమిస్తావు. ఆ నీడలో మా మంచిగుణాలనే తీగలు ఎలా బ్రతుకుతాయి. పోవే పో.

57. ప్రజ్ఞావైభవమెంత యుండినను నీ ప్రాగల్భ్య సంపత్తిచే
నజ్ఞానార్ణవమందు మున్గెదరు నీకాహారమైపోవు ద
ద్విజ్ఞానమ్ము సమస్తమున్ హృదయ పావిత్ర్యమ్ము గోల్పోయి లో
కజ్ఞానమ్మిడినట్టి తద్గురులనే కాదంద్రహంకారమా!!

తా... ఓ అహంకారమా! నీ గొప్పతనం ఎట్లాంటిదంటే, నీవు ఎవరిలో ప్రవేశిస్తావో వారు ఎంత తెలివైనవారైనా అజ్ఞానమనే సముద్రంలో మునిగిపోతారు. వారి విజ్ఞానం మొత్తం నీకు ఆహారమైపోతుంది. హృదయంలోని పవిత్రతను కోల్పోతారు. విజ్ఞానాన్ని అందించి, తీర్చిదిద్దిన వారి గురువులనే కాదంటారు.

58. చాడీల్ చెప్పినవారలే హితులుగా జ్ఞానప్రదుల్ తద్గురుల్
చీడల్ పీడలుగా దలంచుట పురాస్నేహమ్ము వ్యర్థమ్ముగా
బాడైపోవుట క్రొత్తస్నేహితులకే స్వాంతమ్ము చోటిచ్చుటల్
ప్రోడల్ సత్యవిదూరులే యగుట నీ పుణ్యంబహంకారమా!!

తా... చాడీలు చెప్పినవారే హితులగుట, జ్ఞానాన్ని అందించే గురువులు చీడపీడలుగా తోచుట, ఎంతోకాలంగా నడుస్తున్న స్నేహం పాడైపోవుట, క్రొత్తస్నేహితులకే మనసులో చోటిచ్చుట, అసత్యాలాడేవారే గొప్పవారుగా తోచుట ఇదంతా నీ పుణ్యమే కదా అహంకారమా!

59. సత్యాసత్య వివేచనాపటిమ యీషన్మాత్రమున్ లేని దౌ
ర్గత్యంబుల్ ప్రభవించు మున్నుగల సంస్కారమ్ములున్ బోవు నౌ
న్నత్యంబుల్ దిగవారు గుండియ కృతఘ్నత్వంపుటిల్లౌచు నౌ
చిత్యమ్మే యడుగంటు నీవలననే చీచీ యహంకారమా!!

తా... సత్యానికి, అసత్యానికి మధ్యగల భేదాన్ని గుర్తించగలిగే శక్తి ఏ కొంచెమూ లేని దుర్గతి ఏర్పడుతుంది. ముందు గల సంస్కారం పోతుంది. ఔన్నత్యం దిగజారిపోతుంది. గుండె కృతఘ్నతకు ఇల్లుగా మారిపోతుంది. ఔచిత్యం అడుగంటిపోతుంది. ఇదంతా నీవల్లనే. చీ చీ అహంకారమా!

60. దౌత్యమ్ముల్ పదివేలు సల్పినను నౌద్ధత్యమ్ము పోనాడునే
సత్యమ్మున్ బరిమార్చినందులకు బశ్చాత్తాపమున్ గల్గునే
కృత్యాకృత్య వివేచనల్ కలుగునే కెమ్మోవిపై బల్కులా
లిత్యమ్ముండునె నీకు దాసుడగుచో రేరే యహంకారమా!!

తా... ఓసీ అహంకారమా! ఎవడైతే నీకు దాసుడైపోతాడో వాడు పదివేలమంది రాయబారం చేసినా ఔద్ధత్యాన్ని విడువడు. అసత్యాలు పలికినందుకు పలికించినందుకు పశ్చాత్తాపం కలుగదు. చేయదగిన, తగని పనుల వ్యత్యాసం తెలియదు. పెదవులపైనుండి మెత్తని మాటలు రావు.

61. తనదోషమ్ములు కప్పిపుచ్చుకొనుటో, తద్దోషముల్ దిద్దుకొ
మ్మనుచున్ జెప్పినవారిపై కినిసి, నిందారోపముల్ సేయుటో
యనుమానించుచు బూర్వసౌహృద పరిత్యాగమ్ము గావించుటో
కనగా నియ్యది నీవిలాస గరిమల్ కావా! యహంకారమా!!

తా... తన తప్పులను కప్పిపుచ్చుకోవడం, ఆ తప్పులను సరిచేసికొమ్మని చెప్పినవారిపై కోపించి, నిందించడం వారినే అనుమానించడం, పూర్వపు మైత్రీబంధాన్ని విడిచిపెట్టడం ఆలోచిస్తే ఇవన్నీ నీ విసాసాల గొప్పతనం కాదా అహంకారమా!

62. తనమాటే పయినుండ గోరుటలు, పంతంబూని వాదించుటల్
తనకున్ మారుగ బల్కువారలను జీత్కారంబు గావించుటల్
తనకున్ మేలొనరించువారలకు నిందల్ కాన్కగానిచ్చి, వం
చన కావించుటలెల్ల నీదగు విలాసమ్మే యహంకారమా!!

తా... తనమాటే నెగ్గాలనుకోవడం, పంతంపట్టి వాదించడం, తన మాటను కాదన్నవారిని చీత్కరించడం, తనకు మేలు చేసినవారికి నిందలను కానుకగా ఇవ్వడం, వంచన చేయడం ఇదంతా నీదైన విలాసమే అహంకారమా!

63. అకలంకమ్మగు ప్రేమ పెంచుకొని, సౌహార్దమ్ము వాటించి, కో
రకయే సాయము సేసినందులకు దీవ్రమ్మైన విశ్వాస ఘా
తుకతన్ జూపుట, మోసగించుటయు, పొత్తుల్ వీడి, నిందించుటల్
సకలమ్మీవె యనుగ్రహించిన మహైశ్వర్యమ్మహంకారమా!!

తా... నిష్కలంకమైన ప్రేమను పెంచుకుని, స్నేహం చేసి, కోరకుండానే ఎన్నోరకాలుగా సాయం చేసినందుకు ఫలితంగా దారుణమైన విశ్వాసఘాతుకతను చూపించడం, స్నేహాన్ని విడిచిపెట్టడం, పైగా నిందించడం ఈ మొత్తం నువ్వు అనుగ్రహించిన గొప్ప ఐశ్వర్యమేకదా! అహంకారమా!

64. తన కుందేటికి మూడెకాళ్ళనెడి సిద్ధాంతమ్ము రాద్ధాంతమై
వెనుకల్ ముందులు చూడజాలక మహోద్వేగమ్ముతో దాండవిం
చినవానిన్ గని జాలి చెందెదను దచ్చిత్తమ్ములో నీవు చే
రినయట్లాతడెఱుంగడాయెను గదా! రేరే! యహంకారమా!!

తా... ఓసీ! అహంకారమా! ఎవడైతే తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళని అడ్డంగా వాదిస్తూ రాద్ధాంతం చేస్తాడో,వెనుక ముందులు చూడకుండా తీవ్రమైన ఉద్రేకంతో తాండవమాడుతుంటాడో అటువంటి వాడిని చూసి నేను జాలిపడతాను. ఎందుకంటే పాపం తన మనస్సులోకి నువ్వు దూరిపోయిన సంగతి అతనికి తెలీదు.

65. పెదవుల్ నవ్వగ వెక్కిరింపగ నొసల్ వింతైన వాగ్వైఖరుల్
గదియన్ గల్లలనాడుచున్ జనమునాకర్షించి, వ్యక్తిత్వ సం
పదకున్ దానె తిలోదకమ్ములిడుచున్ వర్తిల్లువాడెన్నడే
నెదలో డాగిన నిన్ను గానడుగదా! హేయంబహంకారమా!!

తా... పెదవులతో నవ్వుతూ, నొసటితో వెక్కిరిస్తూ, వింతగా మాట్లాడుతూ, అబద్ధాలతో జనాన్ని ఆకర్షిస్తూ, తన వ్యక్తిత్వాన్ని తానే చంపుకునేవాడు తన మనసులో దాగిన నిన్ను గుర్తించడు. ఎంత హేయమైన విషయమే అహంకారమా!

66. తనవారెవ్వరొ! యెవ్వరో పెఱలు యాథార్థ్యమ్ము వీక్షింపగా
మనసంగీకృతి చేయమిన్ హితము ప్రామాణ్యమ్ముగా బల్కువా
రిని గాదంట ప్రియోక్తులన్ బలుకువారే యిష్టులై వారి వె
న్కను బర్వెత్తుట నీవిలాసముల వైనమ్మే యహంకారమా!!

తా... వీరు నావారు, వారు పరాయివారు అనే సత్యాన్ని గుర్తించడానికి మనసు అంగీకరించక, సప్రమాణంగా హితం పలికేవారిని కాదని, పైకి తియ్యగా మాట్లాడే వారినే ఇష్టులుగా భావించి, వారి వెన్కబడి పరుగులెత్తడం నీ విలాసాల వైనమే అహంకారమా!

67. తనకున్ సాయము చేయుచున్న తఱిలో దాసాంజనేయుండగున్
వెనుకన్ జేసిన మేలునే మఱచుచున్ వీరాంజనేయుండగున్
మును లేనట్టివి క్రొత్తగా బొడముటల్ ముఖ్యమ్ముగా నీవొన
ర్చిన విద్దూరపు·చేష్టకున్ ఫలితమే లెమ్మా యహంకారమా!!

తా. సాయం పొందుతున్నవాడు అవసరం తీరేంతవరకూ దాసాంజనేయుడులా ఉంటాడు. అవసరం తీరగానే వీరాంజనేయుడులా మారిపోతాడు. వెనుక చేసిన మేలు మరచిపోతాడు. పూర్వం లేని పద్ధతులు క్రొత్తగా ఏర్పడడం నీవు చేసే విద్దూరపు చేష్టకు ఫలితమేలే అహంకారమా!

68. తనకున్ గానిది కోరుకొంటయును, సొంతమ్మౌటకై పూని, తో
చిన పన్నాగము పన్నుచుండుటయు నీ చిన్నారి పాదమ్ములె
వ్వని శీర్షమ్మున నిల్పెదో! యచట లోభమ్మున్ బ్రవర్తిల్లి యా
తని బాతాళమునందు నెట్టునుగదా! దండంబహంకారమా!!

తా. ఓ అహంకారమా! నీకు నమస్కారం. ఎవడి నెత్తిన నీ బుల్లి పాదాలు మోపుతావో, వాడు తనది కానిది తనకు కావాలని కోరుకుంటాడు. అది సొంతం కావడంకోసం రకరకాల పన్నాగాలు పన్నుతాడు. లేనిపోని లోభం పుట్టి, అదే వాడిని పాతాళానికి నెట్టేస్తుందిగదా!

69. తలపుల్, పల్కులు, చేతలొక్కటిగ తాదాత్మ్యమ్మతోనుండు మి
త్రులకున్ గయ్యము పెట్టి, మిక్కిలిగ సంతోషించువారెందరో
కలరవ్వారలు చెప్పు కల్లలను నిక్కమ్మంచు నమ్మించి, వా
రల బంధమ్మున జిచ్చు పెట్టుటయ నీ లాస్యంబహంకారమా!!

తా. త్రికరణ శుద్ధిగా స్నేహం చేసే మిత్రుల మధ్య కయ్యం పెట్టి సంతోషించేవారెందరో లోకంలో ఉన్నారు. వారు చెప్పే అసత్యాలను నిజమని నమ్మించి, వారి బంధంలో నిప్పుపెట్టడం నువ్వు చేసే నాట్యమేకదా అహంకారమా!

70. కలకండన్ దినిపించినట్టులుగ విజ్ఞానమ్ము నందించువా
రలతో గయ్యము కల్గుటా! మిగుల చిత్రంబైన యంశమ్ము దు
ర్బలుడే చెప్పుడుమాటలన్ వినును నేరమ్ముల్ త్రయీ తుల్యమై
తలకెక్కున్గద! నీకు దచ్చిరము సొంతమ్మై యహంకారమా!!

తా. అహంకారమా! కలకండను తినిపించినట్లుగా విజ్ఞానాన్ని అందించే వారితో విరోధమా! చాలా చిత్రమైన విషయం కదా! ఎవడికి మానసిక దౌర్బల్యం ఉంటుందో వాడే చెప్పుడుమాటలు వింటాడు. వాళ్ళు చెప్పే చాడీలు వేదంలా తలకెక్కుతాయి. ఎందుకంటే వాడితల నీకు సొంతమైపోయింది కనుక.

71. నడుమన్ గల్గినవారితో జెలిమి ప్రాణప్రఖ్యమై, పూర్వమే
ర్పడియున్నట్టి రసార్ద్రబంధము విషప్రాయమ్ముగా దోచి, ప్రా
నడతల్ మారుచు క్రొత్తవక్రతల చందమ్ముల్ ప్రవర్తిల్లు నె
య్యెడ నీపాదము మోపెదో! యచటనే యేమే యహంకారమా!!

తా. ఏమే అహంకారమా! ఎక్కడైతే నువ్వు అడుగు పెడతావో అక్కడ, మధ్యలో వచ్చినవారి స్నేహం ప్రాణసమానమైపోయి, పూర్వంనుంచి స్నేహామృతంతో తడిసిపోయిన బంధం విషంలా తోచి, నడత మారి, లేని వంకర చేష్టలు ప్రారంభమౌతాయి.

72. శాంతమ్మన్నది లేక సౌఖ్యమగునా! సంతోషముల్ నిల్చునా!
ధ్వాంతమ్మౌ బ్రతుకంతయున్ వెతల సంద్రమ్మందునన్ మున్గుచున్
బంతమ్ముల్ పయికొంటచే తొలగునే బంధుత్వ మిత్రత్వముల్
చెంతన్ నిల్చిన నీవు శాంతమునకున్ జేటే యహంకారమా!!

తా. ఓ అహంకారమా! శాంతం లేకపోతే సుఖముంటుందా! కష్టాల సముద్రంలో మునిగిపోతూ, బ్రతుకంతా చీకటి చేసుకుంటారు. పంతాలు పట్టింపులు పెరిగిపోయి బంధుత్వాలూ, స్నేహాలూ కూడా తొలగిపోతాయి. నువ్వు చెంత నిలబడితే శాంతానికి చేటే.

73. ఎంతో కొంత పరిశ్రమింప నెటులో యేపాటియో కీర్తి మా
పొంతన్ నిల్చిన జాలు నీ నడకకున్ బూబాటలన్ వేయుటే
స్వాంతమ్మందున దూరిపోయెదవు వాక్పారుష్యమున్ నేర్పి కే
రింతల్ కొట్టుచునాడి పాడెదవులే రేరే! యహంకారమా!!

తా. ఓసీ అహంకారమా! ఎంతో కొంత కష్టపడి ఎలాగో కాస్త కీర్తి సంపాదించుకుంటే చాలు నువ్వు మాదగ్గరకు రావడానికి పూలబాట సిద్ధం చేసినట్లే. వెంటనే మామనస్సులో దూరిపోతావు. మాట పెడసరం నేర్పి, మేమలా మాట్లాడుతుంటే నువ్వు కేరింతలు కొడతావు, ఆడుతావు, పాడుతావు.

74. మాసారస్వత సేవ మెచ్చుకొని సంభావించుచున్ లోకమే
దో సన్మానము పేర ద్రవ్యమును మా దోయిళ్ళలో బోయుచో
నా సంపాదన చూచి వచ్చి, వినయ వ్యాసంగమున్ బాపుచున్
మీసమ్ముల్ మెలివేయమందువుగదే! మేలా! యహంకారమా!!

తా. ఓ అహంకారమా! మా సాహితీ సేవ మెచ్చుకొని, ప్రశంసిస్తూ, లోకం ఏదో సన్మానం పేరుతో కొంత ధనం మా చేతుల్లో పోస్తే, వెంటనే ఆ సంపాదన చూసి వచ్చేస్తావు. మా వినయగుణాన్ని నాశనం చేస్తావు. మా మీసాలను మెలిపెడతావు కదా! ఇది మంచిపనేనా?

75. సరసమ్ముల్ విరసమ్ములౌనుగద నీ సాంగత్యమున్ జేసి, సం
బరమే దుర్భరమౌను నీ చెలిమి సంప్రాప్తించుటన్ గౌరవా
దరముల్ వీడి నిరాదరింతురు జనుల్ తార్కొన్నచో నీవు బొం
గరమున్ జేయుచు మమ్ము ద్రిప్పెదవటే కాదా! యహంకారమా!!

తా. ఓ అహంకారమా! నీతో సాంగత్యం ఏర్పడితే సరసాలు విరసాలైపోతాయి. నీతో స్నేహంవల్ల సంబరం కాస్తా దుర్భరంగా మారిపోతుంది. నువ్వు మా దగ్గరకు వస్తే ప్రజలు మాపై ఉన్న గౌరవాన్ని విడిచిపెట్టి, నిరాదరిస్తారు. మమ్మల్ని బొంగరంగా మార్చి త్రిప్పుతావు. కాదంటావా?

76. నరనారాయణులంచు మెచ్చదగు బాంధవ్యమ్మో! మిత్రత్వమో!
వరలన్ వారలయందు దూరెదవు త్రోవల్ మార్చి సారస్యమున్
వైరస్యమ్ముగ జేసి, మైత్రిపయి విశ్వాసమ్ము పోగొట్టి, యి
ర్వురకున్ సంగరమున్ ఘటించెదవటే! పోపొమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! ఆహా! వీరు నరనారాయణులులాగా ఉన్నారని మెచ్చుకొనేలాగ ఎవరైనా బంధువులు గాని, మిత్రులుగాని ఉంటే వారి మధ్యలో దూరిపోయి, సరసాన్ని విరసంగా మార్చి, స్నేహంపై నమ్మకాన్ని పోగొట్టి, ఆ ఇద్దరికీ మధ్య యుద్ధం ఏర్పడేలా చేస్తావు. పో! పో!

77. తరుణప్రాయమునందు గష్టపడి, వార్ధక్యమ్మునన్ సౌఖ్యముల్
వరలన్ హాయిగనుండవచ్చుననుచున్ వాక్రుత్తురేగాని, యె
ల్లరపై బెత్తనముల్ ఘటించు గుణముల్ ప్రారంభమౌనప్పుడే
సరిగానప్పుడు నీవు వచ్చినటులే సత్యమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! వయసులో ఉన్నప్పుడు కష్టపడితే పెద్దవయసు వచ్చాక సుఖపడవచ్చు అని చాలమంది అంటారు. కాని అప్పుడే అందరిమీద పెత్తనం సాగించాలనే కోరికలు పుట్టుకు వస్తాయి. అంటే సరిగ్గా అప్పుడు నువ్వు వారిలోకి ప్రవేశించావన్నమాటే. ఇది సత్యం.

78. జ్ఞాతిశ్చేదనలేనకిమ్మనెడి వాచారూఢి యట్లుండగన్
నీతోడుండినజాలునింక బ్రళయాగ్నిజ్వాల మిన్నంటుటే
నేతల్ దాతలు సత్కవుల్ విబుధులున్ నీదాసులే నీపదా
బ్జాతమ్ముల్ తలదాల్చు భక్తవరులే సత్యమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! దాయాది ఉంటే చాలు వేరే నిప్పు అక్కరలేదనే మాట లోకంలో ఉంది. ఆ మాట అలా ఉంచితే నువ్వు కనుక తోడుంటే సరిపోతుంది. ప్రళయకాలపుటగ్ని ఆకాశాన్ని తాకినట్లే. నేతలైనా, దాతలైనా, సత్కవులైనా, పండితులైనా ఎవరైనా నీ దాసులే. నీ పాదపద్మాలను నెత్తిపై పెట్టుకొనే మహాభక్తులే. ఇది సత్యం

79. కలుముల్ గల్గినచో బురాకృతము భాగ్యమ్మంచు భావింపగా
వలయున్గాని, ధనమ్ము లేని జనులన్ వర్జించుటో! గౌరవ
మ్ములనీకుండుటో! యేల జేయవలయున్ మున్ముందుగా వారి సొ
మ్ములు నీ ముట్టుటచేసి యేర్పడినవా ముచ్చట్లహంకారమా!!

తా. ఓ అహంకారమా! ఎవరికైనా సంపదలు కలిగితే అది ఏజన్మలోనో చేసుకొన్న పుణ్యంగా భావించి సంతోషించాలిగాని, పేదవారిని విడిచిపెట్టడమో, వారికి గౌరవం ఇవ్వకుండా అవమానించడమో ఎందుకు చేయాలి? అంటే ముందుగా వారి సొమ్ములను నువ్వు ముట్టడం వలన ఏర్పడ్డ ముచ్చట్లనమాట అవి.

80. తలమే బ్రహ్మకునైన నీదగు మహత్వంబెన్న నీ పాదు కో
రలలో జిక్కిన యెట్టివానికిని బూర్వప్రాభవమ్ముండునే
బలవంతుండో! ధనాధికుండో! పదవీభాగ్యోన్నతుండో! ప్రవ
ర్తిలునే నిన్ను నతిక్రమించి, యది నీ తేజమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! నీ శక్తిని వర్ణించడం బ్రహ్మతరం కూడా కాదు. నీ పాదుకోరలలో చిక్కినవాడు ఎంతటివాడైనా వాడికి పూర్వం ఉన్న గొప్పతనం ఉండదు. బలవంతుడైనా, ధనవంతుడైనా, ప్రభువైనా ఎటువంటివాడైనా సరే నిన్ను కాదని అడుగు ముందుకు వేయలేదు. అది నీకున్న శక్తి.

81. బంగారమ్మనుకొన్న జీవితము విధ్వంసమ్ము గావించుటే
యంగీకారము నీకు, మాకుగల సౌహార్దమ్ము సర్వస్వమున్
భంగమ్మై చెడిపోవు నీవలన నిన్ వర్జింపలేరెవ్వరున్
సాంగోపాంగముగా త్రయిన్ జదివినన్ సత్యమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! బంగారంలాంటి బ్రతుకును నాశనం చేయడమే నీ అభిమతం. నీవల్ల మాకున్న మైత్రీ బంధం మొత్తం చెడిపోతుంది. సాంగోపాంగంగా వేదాలన్నీ చదివిన పండితులైనా నిన్నుమాత్రం విడిచిపెట్టలేరు. ఇది సత్యం.

82. నిరతంబున్ బరమేశ్వరార్చన కళా నిష్ఠుండుగానుండియున్
విరితోటన్ జరియించు తుమ్మెదబలెన్ వేదాంతవీథీవిహా
ర రతిన్ సాగుచునుండియున్ హృదయసామ్రాజ్యమ్ములో నీవుగా
జరణాంగుష్ఠము మోపినన్ జెడుగదే! సత్యమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! నిత్యం పరమేశ్వరార్చన కళలో నిష్ఠ కలిగిఉన్నా, పూలతోటలోనే తిరిగే తుమ్మెదలా ఎల్లప్పుడూ వేదాంత వీథిలోనే విహరిస్తూ ఉన్నా, అతని హృదయ సామ్రాజ్యంలో నువ్వుకనుక నీ కాలి బొటన వ్రేలును మోపావో! అంతే వాడు చెడిపోవడం ఖాయం.

83. నీచత్వమ్ములకెల్ల నైచ్యగుణమై నీప్రాభవంబొప్పు సం
కోచంబన్నది లేదునీకు బలుచిక్కుల్ తెచ్చు దుర్భాషలన్
మాచేతన్ బలికించి, మంచితనమున్ మాయమ్ము గావించి, మి
థ్యాచాతుర్యము తెచ్చిపెట్టెదవటే దండమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! నీ ప్రభావం నీచత్వాలలోకెల్లా నీచత్వంగా ఉంటుంది. నీకు అసలు సంకోచమన్నది కూడా ఉండదు. ఎన్నో చిక్కులను తెచ్చిపెట్టే తప్పుడు మాటలను మాతో పలికిస్తావు. మాలో ఉన్న మంచితనాన్ని మాయం చేస్తావు. తప్పుడు నైపుణ్యాన్ని మాకు కలిగిస్తావు. నీకు నమస్కారం.

84. త్రాడే పామయి కాటువేసినటు మిత్రత్వమ్ము శత్రుత్వమై
పీడంబెట్టును జేటుదెచ్చును మదిన్ వేధించి, వేధించి ప్రా
జాడల్ కూల్చును మందమారుతములే జంఝూనిలంబౌను మా
నీడన్ నీవొకమారు తాకినయెడన్ నిక్కంబహంకారమా!!

తా. ఓ అహంకారమా! మమ్మల్ని కాదు మానీడను నువ్వు తాకినా, త్రాడే పామై కాటు వేసినట్లు స్నేహమే శత్రుత్వంగా మారిపోయి, పీడ కలుగుతుంది. చేటు ఏర్పడుతుంది. మనస్సును బాధించి, బాధించి మునుపటి గుర్తులను కూల్చేస్తుంది. ప్రశాంతంగా వీచే గాలి తుఫానుగాలిగా మారిపోతుంది. ఇది నిజం.

85. ప్రాలేయాచలమగ్నిగోళమగు స్వర్గంగాంబువుల్ చేదగున్
బూలే రాలగు త్రాడు పామగు సభాపూజ్యుండు నింద్యుండగున్
శ్రీలుప్పొంగినచోటు వేదికయగున్ జ్యేష్ఠామహాదేవికిన్
లీలల్ నీవిటులుండు నిక్కముగదే! రేరే! యహంకారమా!!

తా. ఓసీ అహంకారమా! మంచుకొండ అగ్నిగోళంగా మారిపోతుంది. మందాకినీ నదిలో నీళ్ళుకూడా చేదుగా ఉంటాయి. పూవులు రాళ్ళుగా గట్టిపడిపోతాయి. త్రాడు పాముగా మారిపోతుంది. సభాపూజ్యుడు నిందలపాలౌతాడు. సిరిసంపదలు పొంగులువారే చోటు దరిద్రదేవతకు వేదికగా మారిపోతుంది. నీ లీలలు ఈ విధంగా ఉండడం నిజమే కదా!

86. గురువిందల్ తమక్రిందనున్న నలుపున్ గుర్తింపలేనట్టు లె
వ్వరియందుందువొ వారు నిన్ను గురుతింపన్ లేక యజ్ఞానులై
పరులన్ దూషణ సేయజూచెదరు నీవారంచు నీవెంత ట
క్కరివే కేవలమన్యగోచరవు నిక్కమ్మే యహంకారమా!!

తా. ఓ అహంకారమా! గురువిందపూస తనక్రింద ఉన్న నలుపును గుర్తించలేనట్లు ఎవరిలో నువ్వుంటావో వారు ఆ సంగతి గుర్తింపలేక అజ్ఞానులై ఇంక ఎవరిలోనో నువ్వు ఉన్నట్లుగా ఇతరులను నిందిస్తుంటారు. నువ్వు ఎంత టక్కరివే. మాలో మాకు కనిపించవు గాని, ఇతరులలో కనిపిస్తావు, ఇతరులకు కనిపిస్తావు. నిజం.

87. విలువల్ కల్గిన మానవోత్తముల హృద్వీథిన్ బ్రవేశించి, వా
రలకున్ లేని గుణమ్ములెన్నిటినొ నేర్పం జూతువే క్రొత్తగా
తలపైనిన్ మొలిపించి కొమ్ములను గాంతారమ్ములో గాయు వె
న్నెల గావింతువు వారివారి ప్రతిభన్ నిక్కంబహంకారమా!!

తా. ఓ అహంకారమా! నైతికములైన విలువలతో బ్రతికే మంచివాళ్ళ మనస్సులలో దూరిపోతావు. వాళ్ళకు లేని ఎన్నో గుణాలను నేర్పడానికి ప్రయత్నిస్తావు. క్రొత్తగా తలమీద కొమ్ములు మొలిపిస్తావు. వారి వారి ప్రతిభాపాటవాలను అడవిలో కాసిన వెన్నెలగా చేసేస్తావు. నిజం.

88. నిన్నున్ మెచ్చినవాడు లేడుగద! సందేహించి, దూషించియున్
నిన్నున్ వీడినవాడు లేడుగద! వర్ణింపంగ శక్యమ్మె నీ
చిన్నెల్ వన్నెలు నీ విలాసగరిమల్ చిత్రాతి చిత్రమ్ములై
యెన్నెన్నో కథలన్ సృజించుటయ నీకిష్టమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! లోకంలో నిన్ను మెచ్చినవాడు ఎవడైనా ఉన్నాడా? నిన్ను సందేహించనివాడున్నాడా? నిన్ను దూషించనివాడున్నాడా? అయినా నిన్ను విడిచిపెట్టినవాడున్నాడా? నీ చిన్నెలు, వన్నెలు, విలాసగరిమలు వర్ణించడం మా తరమా! అవి చిత్రాతి చిత్రాలై ఎన్నెన్నో కథలను సృష్టిస్తాయి. అలా సృష్టించడమే నీకిష్టం.

89. పదివేలేండ్లు తపమ్ము చేసియు మహైశ్వర్యమ్ము సాధించియున్
పదిశీర్షమ్ములు కల్గియున్ సుఖముగా వర్ధిల్లెనే భూమిపై
బదికాలమ్ములు నిల్చెనే యతడు నీపాదంబులన్ బట్టుటన్
గద! సర్వస్వమ్ము నశించి, మట్టిగఱచెన్ గాదా! యహంకారమా!!

తా. ఓ అహంకారమా! రావణాసురుడు పదివేల ఏండ్లు తపస్సు చేసాడు. గొప్ప ఐశ్వర్యాన్ని సాధించాడు. పది తలలున్నాయి. అయినా ఈ భూమిమీద సుఖంగా పదికాలాలపాటు వర్ధిల్లాడా? అతగాడు నీ పాదాలు పట్టుకోవడం వల్లేకదా సర్వస్వం నశించిపోయి, చివరకు నేలకూలాడు. కాదంటావా?

90. పికమున్ గాకము కాదుపొమ్మనుటయో! వేమారు దూషించుటో!
బకమే హంసను ద్రోసిరాజనుటయో! వాదాడి గర్వించుటో!
వృకమే సింగమునెంతపాటి యనుటో! వేధింప యత్నించుటో!
సకలమ్మున్ భవదీయ తాండవకళా సారమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! కాకి కోయిలను కాదుపొమ్మని మాటిమాటికి దూషించినా, కొంగ హంసను త్రోసిరాజని వాదించి నిందించినా, తోడేలు సింహాన్ని అదెంతపాటి అంటూ దానిని బాధపెట్టడానికి ప్రయత్నించినా అదంతా నువ్వు ఆడిస్తున్న ఆట, ఆ తాండవ కళాసారమే తప్ప మఱేమీ కాదు.

91. ముత్యమ్మున్ మసిపూసి మెచ్చుటలు నీ ముచ్చట్లు కాబోలు నౌ
న్నత్యమ్మున్ దిగజార్చి నవ్వుటలు నీ నైజమ్ము కాబోలు నౌ
చిత్యమ్మున్ బరిమార్చి చొక్కుటలు నీ చిత్తమ్ము కాబోలు సాం
గత్యమ్మున్ విడగొట్టుటల్ సరసముల్ కాబోలహంకారమా!!

తా. ఓ అహంకారమా! ముత్యానికి మసిపూసి మెచ్చుకోవడం నీ ముచ్చట్లేమో! ఔన్నత్యాన్ని దిగజార్చి, నవ్వుకోవడం నీ నైజమేమో! ఔచిత్యాన్ని నాశనం చేసి, ఆనందించడం నీ మనస్తత్వమేమో! స్నేహితులను విడగొట్టడం నీకు సరసం కాబోలు.

92. మ్రోడున్ గాంచుచు దోహద క్రియలతో బుష్పించుటల్ నేర్పుటన్
మూడౌపూవులకారు కాయలగుచున్ బొంగారుచున్నప్పుడా
నీడన్ జేరినవారలెల్ల హితులై నీరప్రదున్ బూర్తిగా
వీడం జూచుట నీమహామహిమయే వింతా? యహంకారమా !!

తా. ఓ అహంకారమా! మ్రోడును చూసి, నీరుపోయడంలాంటి దోహదక్రియలు చేసి, పుష్పించడం నేర్పితే, ఆ తరువాత మూడుపూవులు ఆరుకాయలుగా ఆ చెట్టు అభివృద్ధి చెందినపుడు ఆనీడలోకి చేరినవారిని తన స్నేహితులుగా భావించి, ఆరంభంలో నీళ్ళుపోసి పెంచినవాడిని పూర్తిగా విడిచివేయడంలో వింత ఏముంది? అదంతా నీ మహామహిమయే.

93. తనకున్ దప్పిక తీర్చి, మేనికిని శైత్యంబిచ్చి, శుభ్రమ్ముచే
సిన పద్మాకరమున్ విరూపమునుగా జేయన్ బ్రయత్నించునే
న్గనకా లక్షణమెట్టులబ్బినది నిన్నున్ మెచ్చి, నీతోడ మై
త్రిని సాగించుటకున్ ఫలమ్మదియలే రేరే ! యహంకారమా!!

తా. ఓసీ అహంకారమా! ఏనుగు తన దప్పికను తీర్చి, ఒంటికి చల్లదనాన్ని ఇచ్చి, శరీరంపై ఉన్న మాలిన్యాన్ని పోగొట్టి, శుభ్రం చేసిన పద్మాకరాన్నే( చెరువునే) సర్వనాశనం చేయడానికి ప్రయత్నిస్తుంది. దానికి ఆ లక్షణం ఎలా వచ్చింది? నిన్ను మెచ్చి, నీతో స్నేహం చేయడంవల్ల కలిగే ఫలితమే అది.

94. నాకున్ దాసులు నాకు దాసులనుచున్ నానాప్రకారంబులన్
గైకోజూచెను గాని పాండవులరొక్కంబెల్ల నేమాయెనే!
నూకల్ చెల్లె సుయోధనాధమునకే, నొప్పించుచున్ శిష్టులన్
నీకే యాతడు దాసుడాయెననుటే నిక్కమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! పాండవులు నా దాసులు, నా దాసులు అంటూ వారి సంపదనంతా కొల్లగొట్టాలనుకొన్న దుర్యోధనుడు చివరికి ఏమయ్యాడు? నూకలు చెల్లిపోయాయి. మంచివారైన పాండవులను తనదాసులంటూ బాధించాడు కాని, నిజానికి ఆ సుయోధనుడే నీకు దాసుడైపోయాడన్నది నిజం.

95. సకలమ్మున్ బరమేశ్వరార్చనముగా సాగించుచున్ జీవనం
బకలంకమ్మయినట్టి వర్తనములన్ ఖ్యాతిన్ సమార్జించు వా
డొకనాడూరక వైరభావమును శ్రేయోదాయిపై జూపుచో
నిక చెప్పం బనియేమి పాపమది నీదే సుమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! సమస్తం పరమేశ్వరార్చనంగా జీవిస్తూ, నిష్కలంకమైన ప్రవర్తనతో ఖ్యాతిని సంపాదించుకొనేవాడు ఒకనాడు అకారణంగా తనకు మేలుచేసినవాడినే శత్రువుగా భావించడం జరిగిందంటే ఇంక చెప్పేదేముంది? ఆ పాపం నీదేసుమా!

96. కలనైనన్ దులసీవనమ్ము నడుమన్ గంజాయి నూహింతుమే
తలపెల్లన్ ఘనసంస్కృతిన్ నిలుప మధ్యన్ బాదమున్ మోపి, ని
శ్చల వింధ్యాద్రివనంగ నిల్చెద వగస్త్యత్వమ్ము మైదాల్చి, నీ
తలదింపన్ వలెగాక వీడవట పంతమ్మీ వహంకారమా!!

తా. ఓ అహంకారమా! కలలోనైనా తులసీవనం మధ్యలో గంజాయి మొక్కను ఊహించగలమా? గొప్ప సంస్కృతితో నిండన తలపు మధ్యలో నువ్వు కాలుమోపుతావు. చలనం లేని వింధ్యపర్వతంలాగ అక్కడే నిలిచిపోతావు. ఎవడైనా అగస్త్యుడులాంటివాడు పుట్టి నీ తల దించే ప్రయత్నం చేయాలే కాని నువ్వుమాత్రం నీ పంతాన్ని విడిచిపెట్టవట.

97. కడగండ్లన్ బడి, కుంది వందుటలు దక్కన్ సౌఖ్యమొక్కింత యే
ర్పడెనే యెవ్వరికైన నీవలన నీపైశాచికత్వమ్ముచే
నడుగంటున్ గద చిత్తశాంతి కల ప్రాయంబంతయున్ వ్యర్థమై
చెడిపోవున్ గద! నీకు జోటునిడుటే చేటై యహంకారమా!!

తా. ఓ అహంకారమా! నీవల్ల ఎవరైనా కష్టాలు కొనితెచ్చుకొని బాధపడటమే తప్ప, సుఖపడ్డవాడు ఎవడైనా ఉన్నాడా? మనసులో నీకు చోటివ్వడమే పాపమై, నీ పైశాచికత్వంవల్ల మనశ్శాంతి అడుగంటిపోయి, వయసంతా వ్యర్థమైపోయి చెడిపోతాడుగదా!

98. కనులున్నన్ గనునా పవిత్రతను లోకంబందు నెందేనియున్
వినునా వీనులు కల్గినన్ సుగుణముల్ విశ్వమ్మునందెక్కడే
ననునా నాలుక యుండియున్ మధుర వాక్యమ్మొక్క నాడేనియున్
నిను సేవించినచో ఫలంబదియెలే నిక్కమ్మహంకారమా!!

తా. ఓ అహంకారమా! కళ్ళున్నా లోకంలో ఎక్కడా మంచి కనబడదు. చెవులున్నా ఎప్పుడూ మంచిగుణాలు వినబడవు. నాలుక ఉన్నా నోట ఏనాడూ ఒక్క మంచిమాట రాదు. ఇదంతా నిన్ను సేవించడంవల్ల కలిగే ఫలితమేలే నిజం.

99. పదవీభాగ్యము లేని మానవుల త్రోవల్ మెట్టవేనాడు చి
న్నదియో పెద్దదొ గద్దె చిక్కినపుడానందంబుతో జుట్టుము
ట్టెదవే ప్రేలుట నేర్పిపెట్టెదవె నోటిన్ గంపు కావింతువే
సదసద్యోజన రూపుమాపుటయె లక్ష్యమ్మై యహంకారమా!!

తా. ఓ అహంకారమా! ఏ పదవీ లేనినాడు వారి దరిదాపులకుకూడ పోని నీవు చిన్నదో పెద్దదో ఏదైనా ఒక అధికారం లభిస్తే, వెంటనే ఆనందంతో వాడిని చుట్టుముట్టేస్తావు. క్రొత్తగా ప్రేలాపనలు నేర్పి, నోటిని కంపు చేసేస్తావు. మంచి ఏదో చెడు ఏదో తెలిసుకొనే వివేకాన్ని నాశనం చేసేయడమే నీ లక్ష్యమై అలాగే ప్రవర్తిస్తావు.

100. అనుమానంబటె, మేక వన్నెపులివై యాసాంతమున్ నీవు మా
యునికిన్ మ్రింగగ జూచుచుందువట, మాయుచ్ఛ్వాస నిశ్వాసలం
దున దాగున్న భవత్ప్రతాపమునకెంతో మెచ్చితిన్ జాలు నీ
కు నమస్కారము పెట్టెదన్ సెలవు గైకొమ్మా! యహంకారమా!!

తా. ఓ అహంకారమా! అనుమానం లేదు. నువ్వొక మేకవన్నెపులివై ( మేకలా కనిపించే పులి ) మా అస్తిత్వాన్ని మొత్తం మ్రింగేయాలని చూస్తావట. నువ్వు ఎక్కడో లేవు మా ఊపిరిలోనే దాగి ఉన్నావు. మాలోనే ఉంటూకూడా మాకు దొరకని నీ ప్రతాపానికి చాలా మెచ్చుకొన్నాను గాని ఇక చాలు. నీకు నమస్కారం పెడతాను. దయచేసి మానుండి సెలవు తీసుకొని ఎక్కడికైనా వెళ్ళిపో.

ఇది కౌండిన్య సగోత్రుండును, కడిమిళ్ళ వంశసంజాతుండును,
బుచ్చమాంబా శేషయ్య దంపతుల పౌత్రుండును, భారతీ వేంకటరామయ్యశాస్త్రి
దంపతుల పుత్రుండును, రమేశ విరించి నామక కవిసోదరులకు
జనకుండునగు గురుసహస్రావధాని వరప్రసాద ప్రణీతంబయిన మానవ మనోవ్యాధి
నిర్మూలనకరమైన దివ్యౌషధము శతపద్య పరిమితము అహంకార శతకము సర్వము
సంపూర్ణము.

# పద్య కుటుంబము

- నా దొక పద్యకుటుంబము
కాదనువారెవరు? సుతులు, కాంతయు గవితా
కేదారమ్మున నిరతో
త్పాదనమును జేయుచుండ బద్యఫలమ్ముల్

- తాతకు లేదు కవిత్వము
నా తండ్రికి కూడలేదు నాకే యబ్బెన్
నాతోడనె యాగదులే
నా తనయులకబ్బె నాదు నారికి నబ్బెన్

- నా వదనమ్ము కావ్య సదనమ్ము రసమ్మట బాకశాల, స
ద్భావనలే గదుల్, నుదులు ద్వారములార్ద్ర గభీర తత్త్వమే
బావి, పవిత్ర శాస్త్రముల వాకిట బద్యము రంగవల్లియై
పావనులైన వారలకు స్వాగతముల్ వచియించునెప్పుడున్॥





పద్యమ్మునెవడురా! పాతిపెట్టెదనంచు
        ఉన్మాదియై ప్రేలుచున్నవాడు
పద్యమ్మునెవడురా! ప్రాతవడ్డదియంచు
        వెఱ్ఱివాడై విఱ్ఱవీగువాడు
పద్యమ్ము ఫలమురా ! పాతిపెట్టిన బెద్ద
        వృక్షమై పండ్ల వేవేలనొసగు
పద్యమ్మునెప్పుడో పాతిపెట్టితిమేము
        లోకుల హృదయాల లోతులందు

ఇప్పుడద్దాని బెకలింప నెవరితరము
వెలికి తీసి, పాతుట యెంత వెఱ్ఱితనము
నిన్నటికి మున్ను మొన్ననే కన్నుదెఱచు
బాల్యచాపల్యమునకెంత వదఱుతనము

– డా॥ కడిమిళ్ళ